# అక్కా - చెల్లెలు

మూలం : రవీంద్రనాథటాగూర్
అనువాదం : అనూరాధ

లీలా పబ్లిషర్సు, విజయవాడ-2

శిలా ప్రచురణ - 19

సంపాదకుడు:

యం. జగన్నాథ రెడ్డి.

ప్రథమ ముద్రణ.

ఆగష్టు 1958

వెల: 1-50 న. పై.

ముద్రణ

శిలా ప్రెస్, విజయవాడ-2

# అక్కా చెల్లెలు

### శర్మిలా దేవి

ఆడవాళ్ళను రెండురకాలుగ విభజించింది ప్రపంచం. ఆ రెండు తెగల్లో ఒకటి తల్లి స్వరూపం– రెండు పెళ్ళాంరూపం. వారిద్దరినీ ఋతువులకు సరిపోల్చిచూస్తే తల్లిని వర్ష ఋతువని; యిల్లాలు వసంతఋతువులాంటిదని అంటారు.

తల్లి లాంటి వర్ష ఋతువు మంచిమంచి వానలు కురిపిస్తుంది. పంటలు పండిస్తుంది. బిడ్డలపొట్టలు నింపుతుంది. ఆకలి బాధను తీరుస్తుంది. అన్ని సంపదలను ప్రసాదిస్తుంది. అందలాల మీాది కెక్కిస్తుంది. ఆతరువాత యిల్లాలనే వసంతర్తువు సుందరమయింది. ప్రకృతి నలంకరిస్తుంది. పురుషహృదయాన్ని సులభంగా ఆకర్షిస్తుంది. తియ్యతియ్యని కోకిలస్వరాలనువినిపిస్తుంది. మలయమారుతాన్ని వీస్తుంది. యెంతో మాధుర్యాన్ని, యేదో ఆనందాన్ని సమకూరుస్తుంది.

మగవానిమన సొక భాగ్యవంతులభవనం. ఆ భవనంలో స్త్రీ ఒక వసంతఋతువులా ప్రవేశిస్తుంది. అందుండే వీణె బంగారుతీగెలమీాద మధురగానాలాపనలు చేస్తుంటుంది. అపుడా నిశ్శబ్దమందిరంలో సందడి వస్తుంది. రాగం బయలుదేరుతుంది. తరువాత చిగురిస్తుంది – పుష్పిస్తుంది – ఫలిస్తుం దా వసంతఋతువు.

శర్మిలాదేవి శశాంకునిభార్య. సిందూర రేఖలాంటి పాపట ఆమె సరళత్వాన్ని చూపుతుంది; కళకళలాడే వజ్రాలుగల చెవులజోడు ఆమెకీర్తిచంద్రికలను చాటుతుంటాయి; నిర్మలమై విశాలమయిన ఆమెకళ్ళలో తుదిమొదలులేని నిండైన మాతృభావం తొణికిసలాడుతుంది.

భర్తప్రేమసామ్రాజ్యాని కంతకూ శర్మిలాదేవే మహారాణి. శశాంకుడు తన జీవితాన్ని తాను సరిగ నడుపుకొనలేక పోయినపుడా శర్మిలాదేవియే సారధిగ రథాన్ని నడుపుతూ వుండేది. ఆమెసహాయంలేనిది శశాంకుడు చిన్నపనికూడ చేయలేడని చెప్పాలి. ఇంతకూ కారణ మేమిటంటే ఆయన చాలా అశ్రద్ధగలమనిషి – దానికితోడు మతిమరపుకూడ అమితంగా వుంది. అటువంటప్పుడు యితరులులేక అత నేం చేయగలుగుతాడు?

చేతికివుండే గడియారంతీసి యెక్కడోపెట్టి స్నానం చేస్తాడు. ఇంతలో ఆ గడియారాన్ని యెక్కడబెట్టిందీ అతనికి జ్ఞప్తివుండదు. అలాగే కలం యేమూలనో దాస్తాడు. మళ్ళీ ఆచోటంటూ అతనికి గురుతుండదు. పోనీ, శ్రద్ధగా వెతుకొక్కనైనా వెతుక్కుంటాడాఅంటే అదీ లేదు. అపుడు శర్మిలాదేవి ప్రత్యేకశ్రద్ధవహించి వాటిని వెతికి భర్తగారి కివ్వాలి. శర్మిలాదేవి యీ బాధ్యతనంతా వహిస్తుందనీ, తన పొరపాటులన్నీ దిద్దుకుపోతుందనీ శశాంకుడికి తెలుసు. అందుచేత అతని మందమతికూడ పెరిగిపోయింది.

అంతేకాదు, ఒకొక్కక్కప్పుడు రెండుకాళ్ళకు రెండు రంగుల మేజోళ్ళు తొడుగుతుంటాడు. అటువంటి లోటులు

కూడ సరిదిద్దటానికి భార్య కనిపెట్టుక కూర్చుండవలసిందే. బంధువులకుగాని, మిత్రులకుగాని ఆహ్వానాలుపంపించే సందర్భంలో బెంగాలీ తారీఖులను, యింగ్లీషుతారీఖులను మిళి తంచేస్తుంటాడు. దానిఫలితంగా ఒక్కొక్కప్పుడు రావలసిన వారు సమయంపోయిన తరువాత వస్తుంటారు; లేదా ఒక్కొ కప్పుడు అనుకున్న వేళకుముందే రావటంకూడ జరుగుతుంటుంది. ఏదియెలాగయినా, వచ్చినవారికి భోజనఫలాహారాదిసౌకర్యాలు చేయాలిగదా మరి? ఆబాధ్యతంతా శర్మిలాదేవే వహించాలి; వహిస్తుందికూడా. రానురాను, యిలాంటి, అవకతవకపనులు చేయటం శశాంకునికి సహజమైపోయింది.

అప్పుడప్పుడు 'ఏమండీ! మీరుచేసే ఈ అవకతవకలను మార్పంటూ రాదా? మీరు సవరించుకోదగిన దేదీలేదను కుంటున్నారా?' అనేది. ఆమాటయినా తీవ్రమయినకోపంతో అంటుందా అంటే అదీలేదు. ఆమె మాటల్లో చిరాకు, కను పించినా, కంఠంలో ప్రేమ వెలువడుతోంది ఎప్పుడయినా శశాంకుడే ఈ అశ్రద్ధకు దూరమయితే శర్మిలాదేవికిమాత్రం చేతినిండాపనిలేక విచారించవలసివస్తుంది. నాగటిపోటులు తిన్న భూమి యిచ్చే అలంకారాన్ని బంజరుభూమి యెలా యివ్వ గలుగుతుంది?

ఒకనాటిరేయి చాలప్రొద్దుపోయినతరువాతకూడ శశాం కుడొక స్నేహితునియింట్లో కూర్చుని పేకాడుతున్నాడు. ఒక స్నేహితుడింతలో నవ్వి 'శశాంక్! నీకువారంటువచ్చిందోయ్! నీవెనుకకు తిరిగిచూడు, యెవరున్నారో' అన్నాడు. అతనిమాట యథార్థమే! వెనుకకు తిరిగిచూచేసరికి, నల్లనిజుట్టు; తెల్లని

మీసాలు; శరీరంమీద బనీను; భుజంమీద ఒకరంగుగుడ్డ, చేతిలో ఒకపట్టుకఱ్ఱతో తయారయ్యాడు మహేశుడు. అతని చూడటంతోనే శశాంకుడికి కోపంవచ్చింది.

'బాబూగారూ! మీరు ఎక్కడ ఉన్నారోలేదో చూచి రమ్మన్నారండీ అమ్మగారు. ఈచీకటివేళ అయ్యగారు పరధ్యాసగా యెటయినా పోయినారని అమ్మగారు సందేహించి లాంతరుకూడ యిచ్చి పంపించా'రని మహేశుడు చెప్పాడు. శశాంకుడి కామాట– బహిరంగంలోను ఆసమయంలో– నామర్దాగా తోచి చివాలునలేచాడు, చేతిలోని ముక్కలు విసిరిపారేస్తూ. అవిచూచి 'ఓహో! సహాయంకోసంని సమర్ధుడోయ్!' అని స్నేహితులు మళ్లీ నవ్వారు. శశాంకుడా కోపంతో యింటికి వచ్చి భార్యమీద విరుచుకపడ్డాడు. నోటికివచ్చినట్లెల్ల చీవాట్లు వేసినా శర్మిలాదేవి బదులుమాటాడకుండా సహనంబూనింది. పాపం! ఆమె మనసులోవున్న భయంవేరు – అతడు ఒంటరి పాటుగానున్నసమయంచూచి మోసగాళ్ళు డబ్బుదోచుకోటం మొదలైన అఘాయిత్యాలు చేస్తారేమో?

ఒకనాడు క్రొత్తవ్యక్తిఎవరోవచ్చి శశాంకునితో బాతాఖానీవేసుకకూర్చున్నాడు. లేచిపోవయ్యాఅన్నా అతడుపోయేట్లు లేడు. శర్మిలాదేవిచేతిలో ఒకచీటి వుంది. అది మాటిమాటికీ శశాంకునిచేతిమీదకు వచ్చి వ్రాలుతూంది. కొంతసేపటికి ఆచీటి విప్పి శశాంకుడు తనమనసులో 'నిన్న మీఒంట్లో ఆరోగ్యం సరిగాలేదు. ఈరోజు లేచి వేళపట్టున భోజనానికి రండి' అని చదువుకొన్నాడు. అంతటితో ఆయనకి రోషంవచ్చి

శర్మిలాదేవితో బదులుమాటేమీ చెప్పకుండా చరచరలాడుతూ లేచి భోజనానికి ఇంట్లోకిపోయాడు.

ఒకనాడెందుకో లేనికోపం తెచ్చుకొని శశాంకుడు శర్మిలాదేవినిచూచి 'మా గొప్పసార్వభౌముల యిల్లాలు మాదిరే నీయధికారమంతా నామీదచూపకపోతే, ఆ దేవుడని ఓపట్టు పట్టరాదూ? నేను బ్రతికిపోతాను. నీవు నాయందు చూపే యీ శ్రద్ధను భరించలేకపోతున్నాను. నీభక్తిశ్రద్ధలలో సగం భగవంతుడిమీద కురిపిస్తే నాకు కాస్తప్రశాంతి చిక్కుతుంది. దేవుడు మనిషిలాగా బలహీనుడు కాడు. నీవుచూపించే శ్రద్ధనంతా ఆయనతప్ప భరించగలవాడులే'డని కసుకున్నాడు.

'అలాగా?' అనంటూ; 'నేనూ, మాబాబాయీ కలిసి హరిద్వారం పోయివచ్చేసరికి మీశరీరారోగ్య మేస్థితికివచ్చిందో మరచిపోయారుకాబోలు' అంది శర్మిలాదేవి.

ఇంతకుముందొకసారి శర్మిల హరిద్వారం వెళ్ళింది. అప్పుడు శశాంకునిపరిస్థితి తారుమారయింది. తనభార్య తిరిగి రాగానే శశాంకుడు తన శరీరారోగ్యాన్ని గురించి బాగులేదని చెప్పటంలో కాస్తవాటిని గంపంతచేశాడు. అలాచెప్పితే శర్మిలాదేవి తనమనసులో- తాను లేకపోతే ఈయనగారి కొక్కరోజయినా జరుగదన్నమాట తెలుసుకుంటుందనిన్నీ, ఆ విషయం భర్తనోటిమీదుగావింటే యింకా ఆనందపడుతుందనిన్నీ ఆనాటితలంపు. ఆనాటిమాట యిపుడు శర్మిలాదేవి సూటిగ అనేసరికి శశాంకునినోటికి తాళాలుపడ్డాయి. ఆరోజున స్వయంగా తన నోటితో అన్నమాటను కాదనటం యెలా మరి భార్య అడిగినదానికి సమాధానమివ్వట మెలా? ఈ

తర్కంతో మథనపడుతూ కాలం గడిపాడు. అప్పటికి సమా ధానమిచ్చే వేళ కాస్తదూరమైనందున యింతేచాలు లెమ్మని మూగవ్రతంబట్టాడా శశాంకుడు.

మరునాడుదయం శశాంకుడికి కాస్త దగ్గుపడిశంపట్టింది. అది తెలుసుకున్న శర్మిలాదేవి వూరుకుంటుందా? క్వైనైను టీలో కలిపి యిచ్చింది. అంతటితో ఆమెకు మనసునిలువక తులసిఆకు రసంకూడా యిచ్చింది. శశాంకుడు తనభార్య యేదియిచ్చినా బదులుచెప్పకుండా త్రాగేస్తున్నాడు. ఇంతకుముందొకసారి శశాంకునికి జలుబుచేసింది. అప్పుడు క్వైనైను తినమంటే ససేమిరా తిన నన్నాడు. వెంటనే చలిజ్వరంవచ్చి అతనిని క్రిందుమీదుచేసింది. ఆఘట్టం యిప్పుడు గుర్తుకురాగానే శశాంకుడు మాటాడకుండా మందు త్రాగాడు.

శరీరారోగ్యాన్ని గురించే శర్మిలాదేవి శ్రద్ధవహిస్తుందని చెప్పటంలేదు. ఇంట్లో యీవిషయాలనుగూర్చి యెంత తాప త్రయం చెందుతుందో, బైటగూడ వాని ఉద్యోగం, గౌర వాలగురించి అంత పాటుపడుతూవుంటుంది. ఉదాహరణకు నీకొకవిషయం చెప్పుతున్నాను:

ఒకప్పుడు ఆ భార్యాభర్తలిద్దరూ నైనితాలుకు వెళ్ళ వలసి వచ్చింది. అందుకని సెలవుపెట్టుకున్నాడు శశాంకుడు. కంపార్టుమెంటుకూడ రిజర్వుచేయించుకున్నాడు. అనుకున్న ప్రకారంప్రయాణంచేసి ఒకరైల్వేజంక్షన్‌కు పోయారు. అక్కడ రైలు మారవలసి మరొకబండిలో వారి బెడ్డింగు మొదలయినవి చేర్పించి భోజనానికి వెళ్ళారు. వారు భోంచేసి వచ్చేసరికి స్టేషను మాష్టరు శశాంకునిచేతులు పట్టుకొని, 'యీ కంపార్టుమెంటు

ముందొక పెద్దఅధికారికి రిజర్వుచేసినమాట గుర్తులేక మీ పేరు యిచ్చాను దయచేసి మరొకపెట్టెలో మీరుకూర్చోండి' అని చెబుతున్నాడు. దానికితగినట్లుగా ఆకంపార్టుమెంటు నొక భయంకరవ్యక్తి ఆక్రమించుకొని అట్టహాసంచేస్తున్నాడు.

శశాంకుడు సరేనని మరొకకంపార్టుమెంటు మారటానికి యిష్టపడ్డాడు. ఆయన వొప్పుకుంటేమాత్ర మాయనభార్య అంగీకరించొద్దూ? శర్మిలాదేవి అపరకాళికాస్వరూపం దాల్చి మహిషాసురుని వధించటానికై దుమికినట్లు ఒక్కఅంగలోదూకింది కంపార్టుమెంటుగేటులోకి. 'నే నీ కంపార్టుమెంటులో నుండి యెందుకు మారాలి? నేను దిగను. అంతటి ధీరుడైనవాడెవడో రండి చూస్తా'నని హుంకరించింది. శశాంకుడది చూచి అదిరిపోతున్నాడు.

శశాంకుడు ప్రభుత్వానికిచెందిననౌకరు కాబట్టి, తనకంటె పెద్దయుద్యోగస్థులనుచూస్తే యెదిరించి మాటాడలేడు. అలాగా వొదిగివుండటం అతని కలవాటు కూడ. ఇప్పుడు తన భార్య యిలా వీరభైరవాకారందాల్చినందుకు ముందు తన ఉద్యోగాని కేం ముప్పు వస్తుందోనని గజగజలాడుతున్నాడు.

'ఇంకా యెన్నో క్యారేజీ లున్నాయికదా!' అని సమాధానంచెప్పటానికి యత్నించాడు శశాంకుడు. అయినా యీమాట లామెచెవిని దూర్చుకొనకపోవటంతో అతని ప్రయాసకు ఫలితంలేకపోయింది. ఆమెదాల్చిన భీకరాకృతిని చూచి స్టేషనుమాష్టరునోరు మరి లేవలేదు. దొర చుట్టకాల్చుకుంటూ రిఫ్రెష్మెంట్‌గదినుండి సరదాగా దయచేసిన

సేనాధిపతిగారి కి దృశ్యం చూడగానే గుండె కలుక్కుమంది. తానే మరొకపెట్టెలోకి సర్దుకొన్నాడు, మళ్ళీ మాటాడకుండా.

'అత నెంత గొప్పఉద్యోగో తెలుసుకొన్నావా?' అని అడిగిన భర్తతో 'ఆయనగొప్పవుంటే వుండనివ్వండి. నా దృష్టిలో అతనికంటె మీరే గొప్ప మనకు రిజర్వుచేసిన క్యారేజీనుండి మన మెందుకు మారాలి?' అని సమాధానం చెప్పింది శర్మిలాదేవి.

'ఆయనగారు కోపంతెచ్చు కున్నట్లయితే?' అన్నాడు శశాంకుడు 'అయితే మీ రనే దేమిటి?' అని అనేసింది శర్మిల.

శశాంకుడు శిబిపురంకాలేజీలో యింజనీరింగ్ కోర్సు పూర్తిచేశాడు. జిల్లాయంత్రాలయంలో చేరి నౌకరీచేస్తున్నాడు. అక్కడుండే సర్వాధికారియైనదొరగారికి దయాదాక్షిణ్యాలు పూర్తిగా లేవు. ఇటీవల అతనికివచ్చిన ప్రమోషనునుండి అకారణంగా తగ్గించి, ఆ ఉన్నస్థానంలో మరో తెల్లవాళ్ళకుర్రాణ్ని నియమించారు శశాంకుడంతటివాడు గుమాస్తామాదిరిగా నానాచాకిరీ చేస్తూంటే ఆ కుర్రసన్నాసి, యీయనమీద పెత్తనం చలాయించటమా? ఇంతకూ కారణ మేమిటి? దొరగారు తమయింగ్లీషువాడిమీద అభిమానం చూపించటమే! అటువంటిసమయంలో తాను పొరపాటుచేస్తే యింకేమయినా వుంటుందా? అక్కడ తన అపరాధాలను దిద్దుకపోవటానికి శర్మిలాదేవికి స్థానంలేదాయె. అందుకని శశాంకుడు యింటి దగ్గర యెంతమందమతిగా వుంటాడో, ఆఫీసులో అంత కంత జాగ్రత్తగా వుంటాడు. పెద్దదొర అప్పుడప్పుడు శశాంకుని బుజ్జ

గిస్తూ ఆప్యాయతచూపి 'మిస్టర్ మజుందార్! నీకు చాలా అన్యాయంజరిగింది. కాని, సమయందొరకగానే నిన్ను పైకి నెట్టి వేస్తా' నంటూండేవాడు.

శ్రీ మాసర్ల సంఘంలో సంబంధంగలవారే దొరగారు, శశాంకమజుందారున్నూ.

ఉద్యోగం, ఉద్యోగంయొక్క అభివృద్ధి యెలాగున్నా శంశాంకుడి కీ విషయాలన్నీ అసంతృప్తిని కలిగించాయి. ఇంట్లో సామాన్యంగా యేచిన్నవిషయం జరిగినాసరే, దానిని గూర్చి కొంత గందరగోళం జరగటంతో మరీ చికాకుపడు తున్నాడు. ఇక ఆఫీసుకువెళ్ళితే యేమూలనోవున్న కాస్త బూజుమీద ఆయనదృష్టి అప్రయత్నంగా ప్రసరించేది. సోఫా మీద పరచిన ఆకుపచ్చనిరంగుగుడ్డ అతనికంటికి వికారంగా కనిపించేది. సరే! అవతలగదిలో ఆఫీసుకుర్రాడు కసవూడుస్తు న్నాడు. మరి దుమ్ములో రేణువులు గాలిలోకలిసి యెగురుతుం టాయి కదా! వాటిని లేవకుండాయెవరైతేమటుకు యేంచేస్తారు? ఆమాత్రపుదానికి 'యీ దుమ్మంతా తూర్పారపట్టేస్తున్నావా, నామీది' కని గాండ్రించాడు. అయ్యగారిగొంతులోంచి వినబడుతూన్న యీ క్రొత్తగీరకు కుర్రాడు తెల్లబోయాడు.

తన ఉద్యోగపుపరిస్థితులు యెటుచూచినా విషమంగా పరిణమించాయి. తన కీ రోజున ఆఫీసులో యింత అగౌరవం జరిగిందన్నసంగతే యింట్లో తెలిసిందంటే – అమ్మయ్యో! ఇంకేమయినావుందా? ఉన్నచిక్కులు తీరకపోగా లేనిచిక్కులు చుట్టుకుంటాయని అతనిభయం. అందుచేత నీవార్త శర్మిలా దేవిచెవిని బడకుండాచేయాలనే చాలా బాధపడ్డాడు. ప్రమాద

వశాత్తు తనకుజరిగిన అన్యాయ మింట్లో తెలిస్తే వెనుకాముం దాలోచించే మనిషా? అదుగో, బెదురూలేకుండా యుద్ధానికి పరుగెత్తుతుంది. డోనాల్డ్సన్ దొరయితేనేం? దేవుడయితేనేం? లెక్క చేయటమంటూ వుంటేగా? దానికితోడు డోనాల్ట్సన్ దొర గారిపేరు చెబితేనే శర్మిలాదేవికి ఒంటిమీద కారంపూసినట్లవు తుంది. దానికి కారణమేమిటంటే—

డోనాల్డుసన్ దొర ఒకనాడు బంగాళాలో బసచేశాడు. ఆబంగళాచుట్టూ ఒకతోట వుంది. ఆతోటనిండా కోతులుచేర గందరగోళంచేస్తున్నాయి. ఆబాధపడలేక దొరగారొకసారి తుపాకి గురిపెట్టాడు. కోతిమీఁత బారుపెట్టినగుండు తప్పిపోయి, ఆ ప్రక్కదారినే నడుస్తూన్న శశాంకుడితలమీఁదనున్న టోపీని ముగురకొట్టివేసింది. నిజాని కారోజు శశాంకుడు నిద్రలేచినవేళ మంచిదికాబట్టే ప్రాణాపాయంతప్పి హేట్టునే తూట్లతో నింపింది. తరువాత 'తప్పెవరిది' అనేమాటమీఁద పంచాయితీ పెట్టారు. అందులో శశాంకుడే నేరస్థుడయ్యాడు. ప్రజ లీ పక్షపాతనిర్ణయాన్ని చేసినట్లు తెలియగానే శర్మిలాదేవిఅగ్గిమీఁద గుగ్గిలమైపోయింది. శశాంకునికి కొంచెం వ్యతిరేకంగా వుండేవాళ్ళు 'శశాంకుడు తనటోపీని అడ్డంపెట్టి కోతిని తుపాకీ గుండుకి గురికాకుండా రక్షించాడులే' అని హేళనచేయటంతో శర్మిలాదేవికి మరీ భగ్గున మండిపోయింది.

శశాంకు డెలా దాచిపెట్టినా తన నౌకరీని తగ్గించిన విషయం భార్యకు తెలియకుండా వుండలేదు. ఆ తరువాత దానికితగిన పుట్టుపూర్వోత్తరాలన్నీ ఆమె యిట్టే తెలుసుకుంది. తనభర్తహృదయంలో ముల్లులాగా యేదో బాధపెట్టుతోందని

కూడా గమనించిన శర్మిలాదేవి ఒకరిచెప్పుచేతల్లో చేతులునలుపు కొనే భానిసత్వానికి స్వస్తి చెప్పి స్వతంత్రాధికారంనాగించుకునే పథకంవేసింది.

'ఈ నౌకరీ యిక చాలు. వెంటనే రాజీనామా వ్రాసి పడేయండి' అని ఖండితంగా చెప్పింది శర్మిలాదేవి.

అతనిప్రాణానికిగూడా అదే హాయి అనిపించింది. ఈ విధంగా రక్తమాంసాదులను తినివేసేబాధ తప్పించుకొంటానికి రాజీనామా మంచిసూత్రమే. అయితే మరొక్కవిషయం- ఈ ఉద్యోగంమూలాన ప్రతిఒకటోతారీఖు వచ్చేసరికి రావలసిన జీతం నిశ్చింతగా వస్తూవుంది. సర్వీసు పూర్తయిననాటినుండి మన మెక్కడ కూర్చున్నా పెన్షను మనకాళ్ళదగ్గరికి నడిచి వస్తుంది. దాని నెలా జారవిడుచుకొంటామా అనేప్రశ్న ప్రత్యక్షమయింది వానిమనసులో.

రాజారాంబాబుగా రేదో యింటున్నవాడు. శశాం కుడు యం. యస్. సి. ప్యాసయినవారిలో అగ్రశ్రేణికి చెంది నట్లు విన్నాడు. ఆ శుభవార్తతోనే కుమార్తెవివాహశుభ కార్యంగూడా పూర్తిచేయా లనుకొన్నాడు. ఆ సంవత్సరమే శర్మిలాదేవి శశాంకమజుందార్లకు పెళ్ళి జరిగింది. శ్రీమంతు డైన మామగారి సహకారంవల్ల అతను యింజనీర్ కోర్సు చదివేడు అతనిచురుకుదనం చూచి తన అల్లుడా యుద్యో గంలో విశేషంగా ధనార్జనచేస్తాడని ఊహించాడు రాజారాం బాబు. అయితే అటువంటికాపురం యిలా బాధపడవలసివస్తుం దని కలలో అనుకుంటానికయినా అప్పు డవకాశ మెక్కడిది?

నిజాని కాలోచిస్తే వారింటిలో లేదనుకోతగ్గవస్తువంటూ యేముంది? పుట్టింటజరిగినట్లే శర్మిలాదేవి అత్తవారింట్లోనూ లోటులేకుండా చేస్తూవుంది. ఇంతకూ మజుందారుగారు తనకు వచ్చినడబ్బుమొత్తం గ్రుడ్డిగ్రవ్వలతోసహా తెచ్చి గృహలక్ష్మి చేతిలో పోసేస్తాడు. తన కేదయినా అవసరమయితే 'ఈ అవస రానికిగాను యింతడబ్బు కావాలి' అని పెళ్ళాంముందర వివ రించుకోవలసిందే! ఆ కర్చు సరియైన దవుతుందా-సరే! అతని కోరిక సక్రమంగా ఫలిస్తుంది. కర్మించాలక శర్మిలాదేవి కది నిర్హేతుకమనిపించిందాఅంటే శశాంకుడిబండిఅడ్డంతిరుగుతుంది. అటునంటప్పుడు ఆయింటికి సంబంధించిన సర్వాధికారా లామె వేగా మరి! ఇంతవరకువచ్చాక గృహపాలనాసభ్యత్వాన్ని శశాంకుడు వొదులుకుంటంలో శర్మిలాదేవి శాసనానికి తిరుగు లేకుండా సాగుతోంది. పోనీ, వారికి సంతానమాఅంటే అదీలేదు. ఇకముందు కలుగబోతారనే ఆశకూడా వారిలో హరించి పోయింది. పసిపిల్లలసందడి లేనికొరత ఆయింట్లో వారిద్దరి గోడవే పూర్తిచేస్తూంటుంది.

'నౌకరీని వదిలివేయటం నాకు హాయిగానేవుంది. నిన్ను గురించే కొంచెం నెమరువేస్తున్నాను. నీ కీ సుఖం లభించ దేమో-' అని అన్నాడు శశాంకుడు.

'ఈఅత్యాచారాల్ని చూచి సహించటంసాధ్యమయినపని కాదు. అటు కడుపులోనికి పోకుండా, యిటు బైటకురాకుండ గొంతులో చిక్కబడిన యీనపుడకలాగా యేమిటిది?' అన్నది శర్మిల.

'నిజమే! మానవుడై పుట్టినవాడు యేదో వొకవృత్తి నవలంబించాలి. స్థిరపడిన యీ సంపాదనను జారవిడచి నమ్మకం లేని యేసంపాదనకోసం పరుగెత్తేను?' అన్నాడు కొంచెం మాత్సర్యంగా మజుందార్.

'క్రొత్తవృత్తిని చూచుకోనేటాగ్రత మీ బుద్ధికి తగిలితేనా? సరే! చేసేనౌకరీవల్ల మీరయినా సుఖపడుతున్నారా అంటే అదీలేదాయె. మీ రెన్నిసార్లు అన్నారు చెప్పండి, యీ నౌకరీమాటనుగురించి – 'బెలూచిస్థాన్ రాళ్ళగుట్టను దాటిపోయినతరువాత రాబోయే భూచిస్థానం'(అంటే భోజనపదార్థాలు మానవులకు నిండుగా లభించేచోటు) అని పరిహాసం చేయలేదు? మీ రీ నౌకరీలో పనిచేస్తున్న ఫలిత మేమిటంటే – 'ఆఫీసుకుమించిన మరొక విశాలమైనప్రపంచం వుందన్నమాటే మరచిపోయారు' అంది శర్మిలాదేవి.

'ఓరి భగవంతుడా! అంత విశాలప్రపంచమా? అయితే, నేను దానిని చూడలేదు. అబ్బో! రాజవీధులు – చిన్న వీధులు – అందులో సందులు – సందుల్లో మలుపులు యెన్నో తిరగాలో తెలుసా? అబ్బా! అంతటిఓపిక నా కెక్కడిదే? అంత ముందుచూపుచూచే దూరదర్శిని నావద్దనుందా? అది యెలా దొరుకుతుందో నాకు తెలియనైనా తెలుసా?' అన్నాడాయన.

'ఈచూపుచూడాలంటే ఆదూరదర్శినీలు పనికిరావండీ! మాదాయాది నెరుగుదురుగా, మధురబాబుని. కలకత్తాలో ఆయనొక గొప్పకంట్రాక్టరు. ఆయనచేసేవ్యాపారంలో మీరు పాటాదారులుగాచేరండి. సంసారంజరగదనేసందేహంమీ కేమీ అక్కరలేదు' అని చెప్పిందామె.

'అందుకో చాలవిషమపరిస్థితు లున్నాయ్ శర్మిలా! ఎందుకంటే? అతనితోబాటు మనమూ తూగాలిగదా! బతుకు కోసం త్రాసులో యేదయినా పెట్టుకుంటే అది పరాయిసొమ్మే గదా! అటువంటప్పుడు మనయెన్ను కుంటుబడితే మన కే గౌరవ ముంటుందా?' అన్నాడు.

'త్రాసుముల్లు మనవైపే మొగ్గుతుంది అవమానపడకు, స్వామీ! బ్యాంకిలో నాపేర మానాన్నగారు వేసినడబ్బు లేదూ? ఆ డబ్బక్కడ నిద్రపోతూ పడి మూలుగుతూంది. దాని నుపయోగిస్తే మన కే విచారమూ ఉండదు' అన్నది శర్మిలాదేవి.

'ఆ డబ్బు నీది. స్త్రీధనాన్ని చిందరవందరచేసేపని నే నెలా చేయగలుగుతానోయ్!' అంటూ లేచి బైటకువెళ్ళ బోయాడు శశాంకుడు. ఆయనగారికోరకు యిద్దరుమిత్రులు వీధిలో కాచుకునియున్నందున అతని కా తొందర. వెంటనే చొక్కాపట్టుకొని పెనిమిటిని మళ్లీ కూర్చుండబెట్టింది, అతని భార్య. 'నే నే మీదాననైనపుడు నాసొమ్ము మీసొమ్ము కాదా?' అంటూ ఆతనికళ్ళల్లోకి ఆనందంగా చూచింది- మళ్ళీ ఆత్మార్పణచేస్తున్నా నన్నట్లుగా శర్మిలాదేవి.

అంతటితో అతని నామె విడిచిపెట్టిందా? 'ముందు కాగితం కలం తీసికొని రాజీనామా వ్రాసెయ్యండి. పోస్టులో రాజీనామాకాగితం పడితేనేకాని, నామనసు స్థిమితపడదు' అని అంటూన్న శర్మిలాదేవికళ్ళలో తనపెనిమిటికి సంభవించిన పరువునష్టానికి ప్రతిక్రియచెయ్యాలి అనే పట్టుదల స్పష్టమగా తోంచె.

'అంతకంటె నాకూ అశాంతిగానే వుంది' అనంటూ శశాంక మజుందారు కాగితం కలం తీసి రాజీనామా వ్రాయటం పూర్తిచేశాడు.

మరునాడు వేకువఝామునే కలకత్తాకుపోయింది శర్మిలాదేవి. నేరుగా మధురదాదా దగ్గరికే పోయింది. సోదర ప్రేమలోని కోపాన్ని చూపిస్తూ 'అన్నాయ్! ఒక్కనాడయినా చెల్లాయి యెలాగుందోనని దిక్కూ మొక్కూ విచారించావా? పాపం!' అని అనేసింది.

ఆమాటే మధురదాదాతోగాక, ఆడవాళ్ళతో శర్మిలా దేవి అనివుంటే 'మరి నీవో?' అని తిరుగుప్రశ్న వేసేవాళ్ళు. మగవాళ్ళంతతొందరగా యిలాంటిమాట లనలేరు కాబట్టి, మధురబాబు తనదే నేరమంటూ ఒప్పుకున్నాడు.

'ఎక్కడ తల్లీ! గాలిపీల్చటానికైనా తీరికలేకుండావుంది. మరీ ఒకొక్కకమారు నేను యీలోకంలో వున్నానా, పరలోకంలో వున్నానా అన్నదికూడా తెలియకుండావుంటుంది. అది అలావుండగా, యెప్పుడుచూచినామీరుక్యాంపుల్లోవుంటారుగా?' అన్నాడు మధురబాబు.

'అది సరే కాని, నీవు మయూరభంజ్ దగ్గరో, మధుర భంజ్ దగ్గరో బ్రిడ్జికంట్రాక్టు చేశావని వార్తాపత్రికల్లో చూచాను. అది ఎంతవరకు జరిగింది? నా కెంతో సంతోషం కలిగి, స్వయంగా నేనే అభినందించాలని వచ్చాను, అన్నాయ్!' అంది శర్మిలాదేవి.

'చెల్లాయిఅభినందన లందుకుంటాని కీ విషయంలో అన్నాయికి కొంచెంగడువు కావాలమ్మా!' అన్నాడు మధురబాబు.

'ఎందుకని?'

'గడ్డుసమస్య ఒకటి వచ్చిపడింది. పని ప్రారంభించాలంటే పెట్టుబడికి సహాయులు కావాలి. అందుకై మార్వాడీకి వాటా యిచ్చేలాగా ఒడంబడిక అయ్యాను. అయితే ఆసేటు లాభ మంతా అతనికి చెందేటట్లు, శరీరకష్టం నాకు మిగిలేటట్లు హిరణ్యాక్షు వరా లడగటంచేత అతనితో జాయింటు ఆలోచనే విరమించుకుందా మనుకుంటున్నా' నన్నాడు మధురబాబు.

అ దేమిటి? అలాజరగటానికి వీలు లేదు జరగనివ్వ' నంటూ కేకలువేసింది శర్మిల. 'చూడూ! నీకు వాటాదారుడు కావాలంటే మమ్మల్ని కాదని పరాయివాళ్ళచేతుల్లో ఇలాంటి వ్యాపారాన్ని ధారాగతంచేసేఅంత పాడుపని మరేదీ లేదు. నీవేమన్నా నేను ఒప్పుకో' నన్నది చెల్లాయి.

'అక్కరసమయంలో ఆదుకున్న చెల్లాయిమీద మధుర బాబు కెంతోసంతోషమయింది. భాగాలని బంధనలన్నీ చకచకా తేలిపోయాయి. కాగితాలు వ్రాసుకోవటంకూడా తొందరలోనే పూర్తయింది.

వ్యాపారం మొదలుపెట్టారు. పట్టింది బంగారమయింది అన్నట్లుగా వారివ్యాపారం పొంగిపోతూంది. మజుందారు ఆఫీ సులో నౌకరీరోజుల్లో నిష్కర్షగా హద్దులు కనుపించేవి. అతని కంటె పైఅధికారుల కాయన ఒదిగివుండాల్సి వచ్చింది. వాళ్ళు చెప్పినపనియేదో పూర్తిచేస్తే ఆయసమం దేహారమూ యిక

వుండేదికాదు. ఇప్పుడో వెనుకటిపప్పు లుడకటం లేదు. ఉద్యోగ బాధ్యతతోపాటు వాటాదారునిశాఖ్యతగూడ తలమీద పడింది. ప్రశ్నలు, జవాబులతో సర్వ కలగూరగంపమాదిరిగా యేకైకరూపం దాల్చినాయి.

న్యాయంగా తా నిప్పు డెంత నిర్లక్ష్యంగాప్రవర్తించినా తన్ను అదుపులో పెట్టేవారు లేరు. అయితే యేం? ఆయన కిప్పు డొక పెద్దపెటకం వచ్చిపడింది. అందులో పెట్టుబడిపెట్టింది భార్యసొమ్ము. ఆబాకీ తీరిస్తేనేగాని మనసుకు స్థాయిలేదనే ఆందోళన మనసులో వేధిస్తోంది. 'బాకీ తీరినతరువాత. యెంత మందంగా నడిస్తేమటుకు యేం లే' అనుకొని తనఖర్చును తగ్గించాడు. ఖాకీప్యాంట్ తొడిగి, నడుముమీద తోలుబెల్టు బాగా సవరించిపెట్టి, తలమీద సోలాహ్యాటుదాల్చి, చొక్కాచేతులు పైకిమడిచి, పాతచెప్పులు తొడిగి, వొదిగి. రణరంగంలోకి పోయే రాజవీరుడులాగా తాను నిర్వర్తింపదగిన పనిలోకి అమాంతంగా దూకుతున్నాడు. ముంజేతి కొక గడియారం, కళ్ళు జబ్బుచేయకుండా చలువఅద్దాలజోడుకూడా ధరిస్తాడు. అయితే వాటిలో యేదీకూడా యిప్పుడుక్రొత్తగాకొన్నది కాదు లెండి. ఎలాగయితే నేం? శర్మిలాదేవి కివ్వవలసినబాకీ చాలా భాగం తీరిపోయింది. ఇంజనుఆవిరియొక్క బలమైనవొత్తిడి తగ్గలేదు. ఉక్కుయంత్రం తిరిగినంతవేగంగా అతనిగుండెలు కూడా పరుగెత్తుతూవున్నాయి.

ఈవ్యాపారానికిముందు శశాంకుని జమకాలం, కర్చు కాలం సమానంగానే పెరుగుతూవుండేవి. ఎప్పుడుచూచినా తెచ్చినదానికీ తిన్నదానికీ సరిపోవటమేకాని, ప్రొటోవరు

వచ్చేది కాదు. ఇప్పు డంటారా?-ఆయనగారిఆదాయపుకాలువ రెండుచీలికలుగా ప్రవహిస్తూవుంది. ఒకచీలిక బ్యాంకి అనే డెల్టాలోకి చొచ్చుకుపోయింది. రెండవచీలిక సంసారమనే మైదానంలో పారి సారవంతం చేస్తోంది. సంసారమనే యంత్రం సాగించటానికి కావలసినధనమంతా శర్మిలాదేవిచేతికి వస్తూనే వుంది. అయితే గృహపాలనారాచకీయతంత్రాలలో ఆయన గారికి జోక్యంలేదు. కలిగించుకోవా లనే అభిప్రాయమైనా అతనికి లేదు. అసలు ఒకరుచేసేపనిలో చెయ్యికలుపుదా మనే భావమే అతనిది కాదు.

అయినా, ఆ భార్యాభర్తలజీవితంలో క్రొత్తమార్పులు రానేవచ్చాయి. శశాంకునిపద్దులపుస్తకాలు శర్మిలాదేవికంటికి చాలదూరమయ్యాయి. అందులోవుండే గుట్టుమట్టు ఆమెకేమీ తెలియటంలేదు. అదే మార్పునకు కారణం. అతను భార్యకు తెలియకుండా దాచినవస్తువయినా ఆపుస్తక మొకటే! అంత మాత్రాన వచ్చేనష్ట మేముంది? లేదుకదా! అయితే ఒకటి మాత్రం నిజం! శశాంకుడు మొదలుపెట్టిన వ్యాపారమంతా తనభార్యసామ్రాజ్యపుపొలిమేరలు దాటిపోయింది. అంతేగాక అదొకస్వతంత్రరాజ్యంగా యేర్పడిందికూడ. శర్మిలాదేవి అధికార మీవ్యాపారస్వతంత్రరాజ్యంమీద చలామణి కాకుండా పోవటమే యీమనస్పర్థలకు హేతువయింది.

'మీపుణ్యం! తాపత్రయపడి శరీరాన్ని పాడుచేసు కోకండి. ఆరోగ్యందెబ్బతింటే యెలాగు? జాగ్రతగా వుండండి' అంటూ బ్రతిమలాడుతుండేది.

అయినా లాభంలేదు. ఇంకా మరొకచిత్ర మేమిటంటే—అతని దేహారోగ్యం బాగానే వుంది. తనగృహలక్ష్మి నిత్యం బహువిధాల ప్రాధేయపడిచెప్పినా ఆయన వాటిని లెక్కచేసే వాడు కాడు. పెందలకడనే నిదురలేచేవాడు. సెకండుహ్యాండ్ ఫోర్డ్ కారును తానే డ్రైవింగ్ చేసుకుంటూ, హారనుమోగిస్తూ, పనిలోకి పోయిన పోవటం మధ్యాహ్నం యెపుడో భోజనానికి యింటికివస్తాడు. తిరిగివచ్చాక 'రెండూ రెండున్నరదాకా తిండికి రాకూడదా' అని శర్మిలాదేవిచేత రెండుచీవాట్లు తింటూ అన్నంతినేవాడు.

మామూలుగా ఆయన కారునడుపుతుండగా ఒకనాడు తనకారుహఠాత్తుగా ప్రమాదాన్ని ఢీకొంది. అయితే మనుష్యులెవరికీ యే అపకారం జరగలేదుకాని, కారుమాత్రం కొంచెం దెబ్బతిని మరమ్మత్తుచేయించాల్సివచ్చింది. ఆమాట చెవినిబడుతూనే శర్మిలాదేవి కంగారెత్తిపోయింది.

'ఏమండీ! మీ రింకడ్రైవరుపనిచేయకండి. మీకు పుణ్యముంటుం'దని విచారకరమైనస్వరంతో వేడుకుంది.

'ఎవరు నడిపినా సమయానుకూలంగా ప్రమాదాలు సంభవిస్తుంటాయి' అని నవ్వుతూ భార్యప్రార్థనను త్రోసి పారేశాడు.

శశాంకు డొకరోజు మరమ్మత్తులపనిని పరిశీలిస్తున్నాడు. ఒకపొడవైనమేకు బూటులోగుండా బోయికాలికిగ్రుచ్చుకొంది. ఆసుపత్రిలో ఆచిన్నిగాయానికి కట్టుకట్టారు. ఇంకా విషక్రిములుంటాయేమో నని యిన్‌జక్షనుకూడ చేశారు. ఆరోజంతా శర్మిలాదేవి భర్తకాలుచూచి కన్నీరుపెడుతూనే వుంది.

'ఇన్నాళ్ళూ, రేపయినా కాస్త విశ్రాంతిగా కూర్చోండి' అని ఆమె వేడుకుంది.

దానికి బదులుగా శశాంకుడు 'అవసరం' అని ఒక్క ముక్కను సమాధాన మిచ్చాడు.

ముక్తసరిగా జవాబులుచెప్పేవారితోటి యెవరయినా యెక్కువసేపు యెలా మాటాడగలుగుతారు?

ఆయనమాటకు 'కాని' అనిఅంటూ ఏదో చెప్పాలని శర్మిలాదేవి యత్నిస్తుంది. అత నది వినిపించుకోకుండా, కాలికి కట్టయినా కట్టించుకోకుండానే అక్కడినుంచి లేచి పోయాడు.

భర్త తనమాటను మీరిపోతున్నా డని ఆమెమనస్సుకు దృఢనిశ్చయంచేసుకుంది. ఇక యిప్పుడు తన బలాబలాలను రంగంమీదకు తీసుకరావటానికి శర్మిలాదేవి అధైర్యపడింది.

ఆమె యెన్నివిధాల ప్రాధేయపడినా, కాళ్ళూ చేతులు పట్టుకొని బ్రతిమాలినా, ఒకప్పుడు తిరిగి వాదించినా, యేం చేసినా 'నాకు తీరికలే' దనే ఒకేఒకమాటతో వాటన్నిటినీ హరింపచేస్తున్నా డతను.

శశాంకునిశరీరాన్ని గురించి, మంచిచెడ్డలగురించి శర్మిలాదేవి ప్రాకులాడేపనిలేదు నిజానికి. కాని ఆమెది జాలిగుండె అయినందున పరితపిస్తుంది. భర్త యింటికిరావలసినవేళకు రాకపోతే, కా రేమయినా దెబ్బతిన్న దేమో నని తహతహలాడుతుంది. ఎండలో అతిగా తిరగటంమూలాన అతనిముఖం కాస్తకందినట్లు వుంటే ఆమెహృదయం కొట్టుకుంటుంది. 'ఇన్ఫ్లూయెంజా వచ్చిపడిందిరా నాయనా' అని కంగారుపెట్టు

తుంది. అంతట పూరుకోకుండా వైద్యుడికోసం కబురంపుతుంది. వైద్యుడు రావటంతోనే 'డాక్టరుగారూ! ఇది ఇన్‌ఫ్లూయెంజా కదండీ?' అని అడిగేది. అప్పటికి యొండబడలికతీరిన భర్త ముఖం ప్రశాంతంగావుండటం చూచి మరి నోరెత్తేది కాదు.

అయితే యిప్పుడిప్పుడు శర్మిలాదేవి మనసులోనిఉద్దేశ్యాలన్ని హృదయసీములో కట్టిపడేసినా దాగియుండని ఆవేదనలను సంపూర్ణంగా దాటపెట్టటానికి సాహసంచేయలేకపోతోంది. ఆమెమనసులో భయంఅనేది తయారయింది. ఆయింట్లో ఆడవారిపెత్తనం సాగేరోజులు మారిపోయి, మగవారిపెత్తనం సాగే యుగారంభమైన దనటాని కిదే గుర్తు.

ఎక్కువగా యెండల్లో తిరిగితిరిగి శశాంకునిశరీరం కొద్ది రోజుల్లోనే నల్లబడి బక్కచిక్కిపోయింది. ఆయన కిప్పుడు తీరికాలేదు. బట్టల అమరికా లేదు. ఇదివరలో రోడ్డుమీద అతను నడుస్తూంటే యేనుగుపిల్ల వస్తోందా అన్నట్టుండేది. ఈనాడతను గబగబా రోడ్డుమీదపోతుంటే చూచేవారికి నడక లేడితో పందెమాడుతోందనిపిస్తుంది. అప్పుడు మాటలపుట్టనిపించుకొన్నాడు. ఇప్పుడు అందరిలో మితభాషి అనే కీర్తి గడించాడు. ఏ వ్యవహారమైనాసరే చిటికెకి మూడుముక్కల్లో ముగించేస్తున్నాడు. భర్తగారిశ్రుతిలో తనగొంతుకూడ కలిపితే బాగుండు నని శర్మిలాదేవిగారిసాహిత్యం వుబలాడపడుతూంది.

శశాంకుడు యెప్పుడు యింటిలోనుండి వెలుపలికి వెళ్ళుతాడో, తిరిగి యెప్పుడు భోజనానికి వస్తాడో యితరులకి తెలియదు. 'నేను పనిలోకి పోతున్నాను. ఆలస్యంగా వస్తాను

భోజనాని' కనే మాటకూడ యెప్పుడు చెప్తాడో యెవరికీ తెలియదనాలి. కాబట్టి శర్మిలాదేవి శశాంకుయింటి ఆచారాలను భర్త అభిప్రాయాలకు తగినట్లు సమకూర్చుకోవలసివచ్చింది. ఇంతకుముందు వారినంటింటిలోని అగ్నిదేవుడికి కొంతవిశ్రాంతి లభిస్తూ వచ్చింది కాని, యీపరిస్థితులలో ఆయనగారు రాత్రింబగళ్ళు తనఫ్యాక్టరీలో వుండాల్సివచ్చింది. తయారయిన పదార్థాలలో యేదీ చల్లదన తోల్పోరాదాయె అందుకని యజమానురాలి ఆజ్ఞానుసారంగా అయ్యగారువచ్చేవరకు పొయ్యిని చుట్టుకొనేవుండాలి మరి —

శశాంకుడు తినటానికై శర్మిలాదేవి అంజూర, ఖర్జూర, ద్రాక్షపండ్లు, సోడాకాయల నొకవైపున - బ్రెడ్, బన్ను, బిస్కత్తులను మరొకప్రక్కన సర్ది పెట్టినబుట్టను కారులో ఒక ప్రక్కగ చేర్చిపెట్టుతుంది. ఆయనగారు తిరిగియింటికివచ్చేలోపల వాటినన్నింటినీ భుజించాలని ఆమెఅపేక్ష. కారు తిరిగి యింటికి రాగానే శర్మిలాదేవి వాటిని విమర్శించి చూస్తుంది. పెట్టినతినుబండారాలన్నీ పెట్టినస్థానాలలో వుండటంవల్ల ఆయన వాటిలో యేఒక్కటీ ముట్టుకోలేదని బుజువౌతుంది. ఆయనకస లావస్తువు లున్నాయి అన్నమాటే గుర్తుండదాయె. తిండీ తిప్పలు సరిగాలేకుండా ఆయనచేసే శ్రమ చూచి శర్మిలాదేవి యెంతైనా నొచ్చుకుంటుంది. అయినా ప్రయోజన మేముంది? అలుసంతయినా అతనిలో జాగ్రత అనేది కలగితేనా? ఆయనగారిదృష్టి మహోద్ధరణమీదకు పోనిస్తాడుకాని, ఈసందర్భాలననుకోనైనా అనుకోడాయె.

ప్రతిరోజూ తప్పకుండా యిస్త్రీమడతలను గదిలో శశాంకునికళ్లముందు కనుపించేలా పెట్టేవి. అయినా లాభ ముండేది కాదు. నాలుగురోజుల కొకసారయినా బట్టలుమార్చు కుంటాని కాయనకు విశ్రాంతి దొరకదు. ఇక కుటుంబపరిస్థితుల్ని గమనించుదాం. ముందు సంసారపుగొడవలలో చాలసేపు తర్జనలుజరిగేవి. ఇప్పు డంటారా? టెలిగ్రాంలో మాట్లాడే మాటలకన్న తొందరలో ముగిసిపోతున్నాయి- అవుననీ, కాదనీ - లాభమనీ, నష్టమనీ మాటాడుకోంటం మామూలై పోయింది. ప్రతివిషయానికీ 'తీరికేది' అన్నమాటే ప్రత్యక్షమై తొందర ఆయనని తట్టి నెడుతూంది. తొందరలో అతను లీనమైపోయాడు. ఆయన తినేదితొందరే! నిద్రించేది తొందరే! అంతా తొందరే!

ఆయనగారు అటూయిటూ పచార్లుచేస్తూంటే, శర్మిల వెనుకనిలబడి 'మాటండీ' అనేది. దాని కాయన ఒక్క మాటతోనే సమాధానం సరిపెట్టేవాడు.

శర్మిలాదేవిదగ్గరనుండి వ్యాపారార్థం శశాంకుడు అప్పుగా పుచ్చుకొన్నడబ్బంతా చుప్తాగాయిచ్చేశాడు. అందు కయిన వడ్డీకూడ చెల్లించి వ్యవహారలోపంలేకుండా ఆమె నద్దనుండి రసీదుకూడ పుచ్చుకొన్నాడు. అతనుచేసేవ్యాపారం మీాద శర్మిలాదేవి కెటువంటిఅనకాశమూ లేకుండా చేసి వేశాడు.

శర్మిలాదేవి కావైఖరి చూడగా వింతగా కనుపించింది. 'ఓరిదేవుడా! మగవాళ్ళెంత స్త్రీలప్రేమలో చిక్కుబడినా అందులోనే నిలిచిపోరు. వాళ్ళస్వతంత్రాన్ని సాగించుకొంటూ

నికిగాను వారిసంపదలో కొంతభాగాన్ని ప్రత్యేకంగా దాచుకుంటూవుకాబోలు' అని పరితపించింది.

శశాంకుడు తనవాటావువచ్చిన ఆదాయాన్ని పెట్టి భవానీపురంలో తనకోరికతీరేసుందరభవనం కట్టించుకున్నాడు. అదిచూచి శర్మిలాదేవి ఆశ్చర్యసాగరంలో మునిగిపోవాలని అతనిఆలోచన. ఆరోగ్యాని కనుకూలమైన కొత్తపరికరాలతో నిండివున ఆయిల్లు. ఎన్నో సౌకర్యాల నమరించుతుంటే, అతని భార్య భర్తకోరికను తీర్చటానికి సమానమైన వుత్సాహం చూపింది. శశాంకుడు యింజినీర్ కదూ! ఆయన కన్ని యంత్రాల యుపయోగాలు తెలియును. కాబట్టి తనయింట్లో గుడ్డలుఉతికి శుభ్రంచేసేయంత్రాన్ని నెలకొల్పాడు. శర్మిలాదేవి ఆయంత్రాన్ని చూచి యెంతగానో పొగిడింది.

అయితే ఆమెమనస్సులో యొకఆలోచన కలిగింది: 'ఈయంత్రం యింట్లోవుంటేచూటుకు బట్టలు మామూలుగా చాకింటికిపోక తప్పే దేముంది? మైలబట్టలమూటను గాడిద మోసుకొనిపోవటమే తే నే నెరుగుదునుకాని, విజ్ఞానవంతులలాంటిపనులు చేసారని నే ననుకోలేదు' అని అనుకుంది శర్మిలాదేవి.

ఉర్లగడ్డలమీద పొట్టువొలిచే యంత్రాన్ని చూచి శర్మిలాదేవి ఆశ్చర్యపడింది. ఆశ్చర్యంతోపాటు ఆమెపొందిన ఆనందానికికూడా మేరలేదు. బంగాళాదుంపలను నీటిలో ఉడికించి ఒక్కొక్కదానిని పొటువొలుస్తూ కూర్చుండే యాతన మూడుపాళ్లు తగ్గిపోయింది. అయితే, ఆ యంత్రం తొందరలోనే తూట్లుపడిపోయినందున పనికిరాని మంచాలు,

కుర్చీలు, చిల్లులుబడిన చెంబులు, గిన్నెలు యింకా యేవేవో పడేసేగదిలోనే యీ యంత్రాన్నికూడా పారేసి తలుపు మూసేశారు.

ఇల్లు పూర్తయింది. ఇంతవరకూ తనలో దాగియుండిన అధికారాన్ని తిరిగి సాగించుకొనటానికి శర్మిలాదేవి కిపు డొక బలమైన ఆధారం దొరికింది. ఇటుకరాళ్ళతో, సిమెంటుతో, సున్నంతో యిలా రూపందాల్చిన ఆ భవన మెప్పటికీ చలించ నంతటి గట్టిదని చెప్పాలి. అంత శ్రద్ధాభిమానాలతో యీరూ పాన్ని గలిగించుకొన్నయింటి కింకా అలమరలు, కిటికీలు తయారుచేయించటానికై యిద్దరుపనివాళ్ళను మాట్లాడి నియ మించారు. అయితే ఆపని పూర్తికాకముందే వాళ్ళు పనిని వదులుకొని 'మీరుచెప్పినట్లుచేయటంమాత్రం మాచేత కాదు, బాబూ!' అంటూ పలాయనం చిత్తగించారు. దానికి కారణ మేమిటంటే ఆ భార్యాభర్త లిద్దరూ అర్థరహితంగా వాళ్ళ మీద కారాలు మిరియాలు నూరటమే!

కుర్చీలు, సోఫాలు మొదలైనవాటి నన్నిటినీ యింట్లో యెక్కడెక్కడ సర్దాలో, ఆబాధ్యతంతా శశాంకునితలమీద పడింది. అతను డ్రాయింగుగదిలోకి వెళ్ళి ఒక్కనిమిషంపాటు గాలిపీల్చుకుంటూ కూర్చుందా మనుకున్నా, అతనికి స్థాయి దొరకలేదు! ఇంతగా శ్రమపడి సొక్కిపోయిన వానినడుములకి కాస్త హాయికలిగించటానికా అన్నట్లుగా మెన్నో బెంచీలు, డ్రాయర్లు శ్రద్ధతోవచ్చి ఆయింటి కలంకార మిచ్చాయి. వాటివాటిస్థానాల నవి ఆక్రమించాయికూడ.

తగినంత వైశాల్యం, యెత్తు గలిగిన ఆయిల్లు బీరు వాలు, టీపాయ్‌సెట్లు, జిగిబిగిలత లలుముకొనినట్లు తీర్చిన నగిషీపనులు, రంగురంగుదారాలతో కుట్టిన తెరగుడ్డలు, యింకా యెన్నో వస్తువాహనాలతో అలంకరింపబడింది. అంతేనా? కాదు - పూలచెట్లు పెరిగే తోట్లు యెన్నిఉన్నాయో చెప్పలేం. ఎటుచూచినా నూతనోత్సాహాన్ని చిందించివేస్తుందా శశాంకుని నూతనగృహం.

అయితే, శశాంకు డీ సమయంలో పగటినిద్దురను పూర్తిగా నిషేధించాడు. పొరపాటుననైనా పడకగదిలో అడుగుపెట్టడు. కారణ మేమి టంటూగా- ఆయనగారి క్యాలెండరులో ఆదివారానికీ సోమవారానికీ భేదమే లేదు. పంచాంగకర్తలు ఒకేరోజున తిథిద్వయం వచ్చింది అన్నటు లుంటుంది యితని వ్యాపారం. ఆదివారాలను వదిలేస్తే యిక సెలవులు పండుగరోజుల్లో వుంటాయి. ఆ సెలవురోజున నౌకర్లు పనిలోని కెలాగూ రారు. అయితే, ఆనాడు శశాంకునికిమాత్రం విశ్రాంతి వుండదు. విసుగు విరామం లేకుండా నీవు పనిచేయాలని మరెవరయినా అతనిని నిర్బంధించేవా రున్నారా అంటే- ఎవరూ లేరు. ఇంకా శర్మిలాదేవిలాంటివాళ్ళు వద్దని బ్రతిమలాడుతున్నా వినకుండా పోయి పాతఫైలును పారజూడటమో, ప్లానులుగీయటమో చేస్తుంటాడు.

ఏది ఎలాజరిగినా, ఒకసంగతిమాత్రం నిజం. పడకటింటిలోని పాతఆచారాలు నిరధికారంగా వుండిపోయాయి. వలసపోయినరాజులచంద మయింది. అయినప్పటికీ వాటి కా యింటిమీదిభ్రాంతి పోక, యింకా చూరుపట్టుకు వ్రేలాడుతున్నాయి.

దానికి సాదృశ్య మేమిటంటే – విశాలమయిన అతనిపడక టింటిలో నిలుచుండిన సోఫా లాయనగారికి సుస్వాగత మిస్తు న్నాయి. ఆ సోఫాలక్రిందనున్న స్లిప్పర్లు యజమానిగారిపాదాల నెప్పు డాశ్రయించుకొని ధన్యత పొందుదామా అని నిరీక్షిస్తు న్నాయి. ఆయనగారి పలువరుసలో నలిగి జన్మరాహిత్యంపొంద టానికై పోకచెక్కలు పాన్‌దాన్‌లో పడి పలవరిస్తు న్నాయి. వెనుకటిరీతిగానే పట్టుధోవతీ, పంజాబుషర్టూ మమ్ము మీదగ్గరకు చేర్చుకొని నాలుగుచోట్లకూ త్రిప్పి చూపించు మన్నట్లు బీరువాలోనుండి యెదురుచూస్తున్నయ్.

ఇతరు లెవరూ ప్రవేశించటానికి కష్టసాధ్యమయిన అతని పఠనాలయంపై అప్పుడప్పుడు శర్మిలాదేవియే ఆయనలేనితరుణం గమనించి పీరసాహసంతో దండెత్తుతుంటుంది. ఆపఠనాలయంలో పనికివచ్చేవాటితో బాటు పనికిరానివస్తువులుగూడా గందరగో ళంగా పడివుండటంచూచిన శర్మిల సహించేది కాదు. ఆమె పాలకుపాలు, నీళ్ళకు నీళ్ళు విడదీసే రాజహంసలాగా పనిము ట్లను సవరించి, తుడుపుగుడ్డతో వాటిపైనుండు బూజు, దుమ్ము మొదలయినవాటిని వదిలిస్తుంది. ఇంతవరకు ఆమెచేసే అపార సేవ మూలవిగ్రహమైన తనభర్తకే చెందింది. కాని యిప్పుడా పరిచర్య మూలవిగ్రహాలయంలో స్థానాన్ని సంపాదించుకొని పూజింపబడేవుత్సవవిగ్రహాలవంటిభర్తగారిపరికరాలకుమాత్రమే లభిస్తోంది.

అంటే, అతనిగదిలోని పరికరాలయందే యింతశ్రద్ధ ఆమె చూపుతుందని అర్థంచేసుకోకండి. ఆయనగారిమనసు నాహ్లాదపరచే ప్రతివస్తువుమీదా ఆమెప్రత్యేకశ్రద్ధ వహిస్తూంది.

అంటే, యింటిని పరిశుభ్రంగా వుంచటం, ఇంటివెలుపల పూలమొక్కలను అందంగా పెంచటం, ఆయనగారుఆసీనులయ్యే తివాచీలమీద కప్పటానికి రకరకాలఅల్లికలు కుట్టటం, దిండ్లపై గలిబులకు ఊలుదారాలతో పూలు చిత్రించటం, తోట్లలో క్రొత్తక్రొత్తరకాల పూలమొక్కలను పెంచటం మొదలైన కార్యక్రమంలో మునిగితేలుతున్న దన్నమాట!

ఇదివరలో ఆమె స్వయంగా గర్భాలయంలోకి పోయి యిష్టదేవతారాధన చేస్తుంది. మరి యిప్పు డంటారా? 'అవసర మైన పని' అనే పూజారి మధ్య వచ్చి, ఆమెఅధికారాన్ని కాస్తా తీసిపారేశాడు. అందుచేత ఆమెయిపుడు తనస్వామికి దూరంగా వుండే, పూజాద్రవ్యాలను సమర్పించాలి. ఆ లేతహృదయాని కిది ఒకగొడ్డలిపెట్టనక తప్పదు. స్వయంగా స్వాములవారు తనపూజను స్వీకరించకపోయెనే అనే విచారంతో శర్మిలాదేవి మనోపుష్పం వాడిపోవటంలో వింతేమీ లేదు.

అందుకుతోడు లోగడరోజు జరిగినదానినిగురించి ఆమె మనసులో కుమిలికుమిలి యేడుస్తూంది. అది ఇతరు లెవ్వరికీ తెలియదు. ఆక్రిందటిరోజు కార్తీకబహుళఅమావాస్య అయింది. శశాంకునిజన్మదినంగూడ అదే! అన్నిపండుగలకంటె ఆమె దానిని మహాపర్వదినంగా భావించింది. ఆమెమిత్రులందరికీ స్వాగతపత్రా లంపించింది. గృహమంతా చక్కగా అలంక రించింది. మధ్యాహ్నం యింకా కాలేదు. శశాంకుడా కళకళ లాడేయింటిలోకి వచ్చాడు. 'ఏమి టీగొడవ అంతాను? బొమ్మలపెళ్ళి చేస్తున్నావా?'అన్నాడు.

'బాగుంది! మీరు పుట్టిన రోజిదే నన్న మాటగూడ మీకు గుర్తులేదా? లేకపోతే, లేకపోనివ్వండి. ఈరోజు సాయంత్రం మీ రెక్కడికి పోవటానికి వీలుకాదని చెప్పిందామె.

'ఏనాడూ వ్యాపారం అనేదానికి విశ్రాంతి అనేది లేదు. ఇక నేను వచ్చిపోయినాక విశ్రాంతి చిక్కవలసిందే' అన్నాడు శశాంకుడు.

'మ రెప్పుడూ మి మ్మిలా కోరను. ఈనాటిసాయంత్రం మటుకు తమ రింట్లో వుండండి. ఎంతోమంది వస్తారుగూడ' అని బ్రతిమలాడిం దతనిభార్య.

'శర్మిలా! న న్నొక ఆటబొమ్మగా తయారుచేసి యీ ప్రజలందరికీ చూపించా లనుకుంటున్నా నన్నమాట' అంటూ శశాంకుడు బజారుదారి పట్టాడు. అదిచూచిన శర్మిలాదేవి గదిలోకి పోయి కొంచెంసేపు బావురుమంది.

స్నేహితులంతా సాయంత్రానికి వచ్చి దిగారు. 'వ్యాపారం' అనే రాజాధికారాన్ని చూచి వారంతా తలలు వంచారు. ఆ రూపాన్ని స్పష్టంగా అవగాహనచేసుకున్నారు. అంటే— పూర్వం మహాకవి కాళిదాసుగారిజన్మదినోత్సవంనాడు నియమిత కాలంలో సమావేశానికి చేరలేదు. తరువాత తను శాకుంతల నాటకంలో తృతీయాంకం పూర్తిచేసిన నిజమయినకారణం చెప్పితే, ఆ సాకుకు బలం చాలదని, సభికు లామోదించరని యేదో మరొకకారణం చెప్పి తప్పించుకొన్నాడట!— అలాగే యీయన గారా వ్యాపారాన్ని నెపంగా చూపినప్పు

డంగీకరించాల్సిందేగా? అతను లేకుండానే అతనింట్లో అతని పుట్టినరోజు పండుగ జరిగిపోయింది. అతిథుల కేమాత్రం కొరత లేకుండా మరి కూడదలు జరిగాయి.

ఈ నవయుగనటీమణులను కూర్చి, చిత్రవిచిత్రచిత్రాలు చిత్రించి, అందరినీ పొట్టలుబ్బ నవ్వించాడు నాంబూబాబు. అతని జన్మదినోత్సవంనాడు అతనిభ క్తురాలు అతనివ్యాపార దేవతకు సాష్టాంగపడింది. శర్మిలాదేవి తా నెంతబాధలో వున్నప్పటికీ, వాయువేగంలోతీవ్రంగాప రుగులె త్తేభ ర్తవ్యాపారగణపుజండాను చూచి భ క్తితో నమస్కరించింది.

వ్యాపార మనేది – కాలని కొయ్య; ఓడిపోని యోధు రాలు; పశులను లెక్కచేయని పెంకిమనిషి; తిరస్కరించే పొగరుబోతు; చెడ్డపాపిష్ఠురాలు; వలచినపురుషుడ్ని కొంగున కట్టుకునే వేశ్య; ర క్తమాంసాలను పీల్చే పిశాచి; భార్య విధే యతతోచేసే ప్రార్థనలను ప్రాధేయతలను అర్థింపులను లక్ష్యం చేయనీయని నిర్దయస్వాంత!

నిజానికి పాప మా యిల్లా లెంతోప్రయత్నంచేసింది కదా! నలుగురిలో ఆమెకు తలవంపు లయ్యాయిగదా! వ్యా పారమనే కబంధహస్తాలనుండి శశాంకు డొకగంట కాలమైనా విశ్రాంతితీసుకోగలిగాడా మరి!

తుట్టతుదకు భ ర్తతో చనవుగమాటాడే భాగ్యమయినా నోచుకుందా ఆమె? లేదే! ఆవిధంగా వ్యాపార మనేది చేసే దానిలో చెడుపేగాని, మంచిఅంటూలేదా అని అంటారేమో! లేకపోవటమేం? తాను చేరదీసిన మానవునికి తాను వశమై

వుంటుంది. మనోనమ్మకాన్ని బలపరుస్తుంది. స్వాతంత్ర్యాభిలా షాన్ని మనసులో నెలకొల్పుతుంది. ఎడతేని ధైర్యసాహసాలను కలిగిస్తుంది.

అది వాళ్ళజీవితప్రవాహం. ఆగట్టున నిలుచుండి తనభర్తను చూస్తుంది. ఆమెచూపులో భయసీకితమనస్సు, భర్తకి మయభావము మిళితమయి కనుపించుచున్నవి. అతనివాణిజ్య సామ్రాజ్యం గృహసీమలకు చాలాదూరంగా వుండివుంది. సముద్రపుగట్టున నిలబడి వుంది. కాతా లున్నవారిని, లేనివారిని వ్యాపారులలో వెతికి పట్టుకోచూస్తుంది. తమయంత్రాన్ని పటుత్వమైన పునాదులమీద శాశ్వతంగా నిలుపుకోటానికి చూస్తున్నారు. ఆ యాలోచన శర్మిలాదేవి కర్థమౌతూనే వుంది.

మానవుడు కృషిఅనే భుజబలంతో జాతకచక్రంలోని దుష్టగ్రహాలతో ముష్టియుద్ధం చేస్తుంటాడు. సతమతమవుతుంటాడు. పడుతూలేస్తూ నడిచి చేరుకునే ముందు మార్గాన్ని చేరనీయకుండా – తరుణీమణి అతన్ని నిలిపివేయటానికి తన బాహులతలో బంధించితే పురుషు డేమి చేయగలడు? అనే ప్రశ్న వస్తుంది. ఆప్రశ్నను విడగొట్టేనూత్ర మేమిటి అనేది దాని వెంటనే ప్రత్యక్షమౌతుంది.

అభివృద్ధి వాశించినవాడు తన్ను చుట్టుకొన్న బంధాలను తెంపివేస్తాడు వానిమన సపుడు కాఠిన్యాన్ని దాలుస్తుంది, వ్యాపార మనే ప్రేయసికి వశమైన మోహాంధకాముడులాగా ప్రవర్తిస్తాడు. తనభర్త యిపు డాదశలో నున్నటులు శర్మిలాదేవి అవగాహన చేసుకుంది. ఆయనకాఠిన్యాన్ని ప్రేమతో నమ్మి శ్రద్ధాంజలిచేసింది. ఈసంగతి మరచిపోరాదు. అందుపై మరొక

ప్రశ్న కూడ వేయవచ్చు. తపోనిష్ఠలోనున్న ఆదిశంకరుని కరుణకై యెదురుగా తానుకూడ తపోదీక్షలో కూర్చున్న పార్వతీదేవిమాదిరిగానా? అని అంటే-శర్మిలాదేవికి అంతశక్తి లేకపోయినా మొత్తంమీద పార్వతితో పోల్చవచ్చు నన్న మాట! తరచు ఆమెలో బయలుదేరే నీరసాలను ప్రేమదేవత ఉపసంహరిస్తుండేది. ఆసమయంలో శర్మిలాదేవి 'మనోసీమగల శ్రద్ధ, తొందరలు పొంగిపోయి పనికిరాదన్న ప్రదేశాలలో పారి యజమానురాలిఅధికారాలను మీరేవి. శాసనాన్ని మీరినవారు శిక్షననుభవించటం న్యాయమే! అయితే, ఆమె శిక్షించటానికి చేతగానిదై పోయింది. శిక్షించలేకపోగా తిరస్కారాన్ని కూడా పొందేది. ఆ తిరస్కారాన్నే ఆమె 'మహాభాగ్య'మంటూ స్వీకరిస్తుంది.

శర్మిలాదేవి తన్ను నిరసించినమాటలకు క్రొత్తతాత్పర్యాలను చెప్పుకుని సంతృప్తిచెందేది. ఇంతెందుకు? ఆయనతిరస్కృతిలో గొప్పలక్షణా లున్నాయి అని ఆమెభావం. ఎప్పుడయినా ఆపుకోలేని దుఃఖం వచ్చినపుడు ఒక్కఅడుగు నిదానించేది కాని, అంతటితో నిరుత్సాహపడి, దుర్బలంగా నిష్కారణంగా కూర్చుండేది కాదు. తాను పోవటానికి చూడటానికి అలభ్యమయినప్రదేశాలలోనున్న తనపెనిమిటినడకలను కనిపెట్టియుండవలసినదిగా వేయిదేవుళ్ళకూ, పెద్దలకూ మ్రొక్కుకుంటూవుంది; 'సర్వదా నాభర్తను కాపాడు' మని తన యిష్టదేవత నారాధిస్తూ వుంది.

# ఏ ర ఢ పెం ఖ ర్జి

వేస్తే వెయ్యిరూపు యన్నట్లు వారికాపురం కలిసి వచ్చింది. బ్యాంకిలో నిల్వడబ్బు లక్షలసంఖ్యలో తయార యింది. అలావుండగా శర్మిలాదేవికి జబ్బుచేసింది. ఆజబ్బు ఫలానా అని నిర్ణయించటానికి వీలుగాక పోయి,ఆమెను వదిలి పెట్టకుండా వుంది. ఆరోగంయొక్క బలంముందు నిలువలేక మంచంపట్టిందామె. ఆ జాడ్యాన్నిగురించి అక్కడివారికి యింతాఅంతా అనరానివింత కలిగింది.

శర్మిలాదేవితండ్రి రాంబాబుగారికి బారిసాలో గొప్ప ఎస్టేటు వుంది. గంగానదీముఖద్వారానికీ యీ ఎస్టేటుకీ చాల సమీపం. షాలిమూరునందలి ఓడనిర్మాణవాణిజ్యంలో కొన్ని షేర్లుకూడ వున్నాయి నూతన పురాతనాల సంధిలో రాజారాం పుట్టాడు. కుస్తీ, వేట, కత్తిసాము బాగా నేర్చిన వాడు. మృదంగవాద్యంలో అపరమార్దంగికాచార్యు డని చెప్పవచ్చు. జూలియస్ సీజర్, మర్చంట్ ఆఫ్ వెన్నిస్, హామ్లెట్ మున్నగు నాటకాలలో యెంతోభాగం కంఠతా వప్పగించ నేర్చాడు. మెకాలేదొరగారి ఆంగ్లరచనా శైలి నాయన అభినం దిస్తాడు. బర్కుగారి యుపన్యాసాలను అద్భుతంగా శ్లాఘిస్తాడు. బెంగాలీభాషలోని మేఘనాథకావ్యస్తుతిస్థానాన్ని రాంబాబు సాహిత్యం అందుకొంది.

ఆయనగారు నడివయస్సులో నున్నప్పుడు సారాయి మొదలైన నిందితవస్తువులను పుచ్చుకొనటం నవయుగాచారా

నికి ప్రధానాంశంగా దలంచాడు. అయినా వయసుతో కేసరి కా నిషేధపదార్థాలను వదిలిపేశాడు. పొడవు, లావు కలిగిన గంభీరంతో మంచిసుందరస్వరూపుడు. పరిశుభ్రమయిన బట్టలు వేస్తుంటాడు. అందరికీ వొద్దికగావుండే సహృదయుడు. ఆపద లోనున్నవాళ్ళు దేహీ అని చేయిచాచితే సహాయంచేస్తుం టాడు. ఆయనమనసులో దేవతలయందు పూజలయందు అభి మానంలేకపోయినా యింట్లో ఆడవారు జరిపేటప్పుడు చాలా ఆడంబరంచేస్తుంటాడు. కుటుంబమర్యాదను పెంచుకుంటా నికి పాటుపడతాడు.

ఇతరు లెవరయినా 'బాబుగారూ! 'రాజా' అని మిమ్మ ల్ని పిలిస్తే మీా రయిష్టతచూపిస్తా రేమండీ?' అని అడిగితే ఆయనగారు మనసులోనికోరికను కప్పిపెట్టి, పైకి నవ్వుతూ 'మా తండ్రిగారు నాకుపెట్టినపేరులో 'రాజా' అని వున్నదికదా! ఇంకా ఎందుకీ లేని బిరుదులు! అదీగాక అప్పుడు మా నాన్న గారు పెట్టినపేరుమార్చితే ఆయనను చిన్నబుచ్చిన ట్లవుతుం దని నా భావం' అనేవాడు.

ప్రభుత్వంవారి భవనంలోనుండి రాజారాంబాబుగా రింటికి వేరేమార్గ ముంది. రాత్రికాలంలో అక్కడనుండి సీసు ప్రవహించి యీయనగారింటిలో చేరుతాయి. ఆ సందర్భంలో తనయింటి కతిథులుగ వచ్చిన యూరోపియన్‌యుద్యోగస్థులం మంచినీరు హాయిగా త్రాగేవారు.

శర్మిలాదేవివివాహానంతర్వాత రాంబాబుభార్య మరణిం చింది. తనపెద్దకుమార్తెను అత్తవారింటికిపంపగా యింట్లో

తాను, చిన్నకూతురు ఊర్మిమాల, పెద్దకొడుకు హేమంతుడే ఆయింటిలో మిగిలారు.

కుర్రవానివిషయమైతే—అంటే – హేమంతునిసందర్భంలో ఉపాధ్యాయవర్గంవారు 'అసాధారణవివేకశాలి' అని గొప్పగా చెప్పుకొనేవారు. హేమంతుడు మంచిఅందగాడుగూడ. దారిలో యెదురుపడి అతనినిచూచినవాళ్ళు మళ్ళీ చూచితీరుతారు. పరీక్షలన్నిటిలో అత డుత్తీర్ణు డయ్యేవాడు. ఏభాగం లోనూ తక్కువమార్కులు వచ్చేవి కావు. పోనీ, ఆటలలో యేసుయినా వెనుకాడతాడా అంటే – 'బలేబలే – తండ్రిని మించిన కొడుకురా!' అనిపించుకుంటున్నాడు. అటువంటప్పుడు పెళ్ళిడువచ్చిన ఆడపిల్లలుగలతండ్రు లతనిని పదేపదే పరికించి చూస్తున్నా రంటే ఆశ్చర్యమేముంది?

అడిగినవారికి హేమంతుడు తనపెళ్ళి కింకావ్యవధాన మున్నదని సమాధానమిస్తున్నాడు. ముందు ఆంగ్లేయయూని వర్సిటీహోదా చేపట్టాలని ఆయనమనస్సు ఉవ్విళ్ళూరుతోంది. ఆడిగ్రీ నార్జించటానికై జర్మను,ఫ్రెంచి భాషలను రాత్రింబగళ్లు చదువుతున్నాడు. అవసరం ఉండదని తెలిసికూడా, తెలిసివుంటే మంచిదని న్యాయశాస్త్రంకూడా మధ్యమధ్య వర్ణిస్తున్నాడు.

అటువంటిస్థితిలో అనుకోకుండా హేమంతుడి కనారోగ్యం కలిగింది. వైద్యు లెంతమందో వచ్చారు. వ్యాధి నిర్ణయాన్నిగురించి తర్జనభర్జనలుచేశారు. ఇంతకూ జబ్బు పేరేమిటంటే – పేగులలో పుట్టిన రోగమో, కండలలో పుట్టినరోగమో, మరి యేయితరసంబంధమైన రోగమో వాళ్ళకు బోధపడని క్రొత్తరోగ మని చెప్పాలి. ఆవైద్యులలో

ఒకరు 'అవును' అనటం – మరొకరు 'కా'దని మొదటివైద్యుని వ్యతిరేకించటం–ఆపై వారిద్దరూ గ్రుద్దులాడుకొనేవరకూ రావటం తప్ప ప్రయోజనంలేకపోయింది. ఇంతకూ సురక్షితంగా హేమంతునిశరీరంలో పీఠంవేసికొనికూర్చున్న ఆదొంగజబ్బు నామధేయం దొరకలేదు. వైద్యవీరులు దానిని పరిశోధించి, ఔషధప్రయోగంచేసి, శత్రురోగాన్ని సంహరించి, హేమంతుని శరీరసామ్రాజ్యాన్ని రక్షించటం దుస్సాధ్యమయింది.

ఇంగ్లీషుదొర ఒకాయన అప్పుడు సర్జనుగా పనిచేస్తు న్నాడు. శస్త్రవైద్యంలో మంచిపేరు సంపాదించాడు. అతని మీద రాజారాంగారికి అసాధారణమయిన నమ్మకము, ప్రేమ లున్నాయి. ఆవిషయం మీరు నమ్మవచ్చు– నమ్మకపోవచ్చు కాని హేమంతునిశరీరం సర్జనుగారిఅధీనమయినమాటమాత్రం యథార్థం. ఆయనగారుగూడ రోగిని పరిశీలించి చూచాడు. తుద కాయనగూడ వ్యాధినిర్ణయంచేయలేకపోయాడు. తనరోగి శరీరంలో దాగియున్న మాయజబ్బును తానుగూడా పట్టుకో లేకపోయాడు. 'అంతుపట్టనిజబ్బు' అనే ఆయన తేల్చిన సారాంశంకూడ.

చివర కిలా తేలదని హేమంతునిశరీరం తనచేతిలోనిచిరు కత్తులతో చీల్చి రోగాన్వేషణ చేశాడు. కాని ప్రయోజనంలేక పోయింది. ఏవిరోధి దాగియున్నా డనుకొని తా నింతగా ఆయుధప్రయోగంచేశాడో డాక్టరుగారు – ఆ విరోధి లేదు. లేకపోగా అతనివలన గలిగిన అపకారంగూడా లేదు.

కత్తికోతలతోమాత్రం కీడుజరిగింది, హేమంతుడికి. తిరిగి తాకటానికి వీలులేని అగాధంగా తయారయిన ఆపరేషన్

పేరుకెక్కినసర్జనుగారిఅసమర్థతను ఋజువుచేస్తూ, హేమంతుని సరాసరి స్వర్గలోకానికి సాగనంపింది. రాజా గాంబాబుగారు దరీపరీలేని విచారసముద్రంలో మునిగిపోయాడు. శోక మనే అలలలో అతనిమనసు కొట్టుకుంటూ వుంది. బాబుగారు బిడ్డ చనిపోయినందు కేగాక మరొకందుకుకూడా విలపించాడు. 'పండువంటి నాతండ్రిని పండబెట్టి కోయించానే! నా పాపిష్ఠి కళ్ళతో చూస్తుండగానే ఆ పాడుకత్తులతో ముక్కలుముక్కలు చేశాడే?' అనేదే పెద్దబాధ!

ఈ విచారం అతనిహృదయాన్ని విడిచిపోలేదు. రాత్రింబగళ్ళు పీడిస్తోంది. రక్తమాంసాలలోనిసారమంతా జలగపట్టు పట్టి లాగుతోంది. అతను కళ్ళుమూసినంతలో జాలిగా చూస్తున్న పెద్దకొడుకుకళ్ళముందుగోచరిస్తున్నాడు. తెలిసీ తెలియనిమత్తులో వుండి హేమంతుడు కత్తిపోటులుసహించలేక అనుభవించిన మూగబాధ ఆయనగారికళ్ళముందు పెట్టినట్లు కనుపిస్తుంది. చీకూ చింతాలేని జీవి యిటువంటి హత్యాపాపాలను చూచి నిబ్బరించగలుగుతాడా?

వారింపరాని యీదిగులు రాజా రాంబాబు గారిగుండెలకు శూలంలాగున నాటింది. ఆ తీవ్రబాధవల్ల ఆయనగూడా పడకపెట్టాడు. చివరకు మరణదశనుగూడ సమీపించాడు.

నీరదబాబు, హేమంతుడు చిరకాలస్నేహితులు. అందులో వా గిద్దరూ ఒకే పాఠశాలలో ఒకేతరగతిలో విద్యనభ్యసించారు. నీరదబాబు డాక్టరుపరీక్ష ప్యాసయింది క్రొత్త. హేమంతుడికి అనారోగ్యం సంభవించినట్లు వినగానే ప్రియమిత్రుని కుపచర్యచేయునిమిత్తం డాక్టర్ నీరదబాబు పరుగెత్తుకు

వచ్చాడు. హేమంతునికి యీగాలి పడనందున యీప్రదేశం మార్చి, తేమలేనిప్రదేశాలలో వుంచితే తప్పక నయమవుతుం దని ఖాయంగా చెబుతున్నాడు. ఈ వైద్యులుచేసే హంగామా చూచి మీరు కేసు నర్థంచేసుకోవటంలేదని గోలపెడుతూనే వున్నాడు.

రాజారాంబాబు డాక్టరు నీరదబాబుగొడవ నాలకించలే దప్పుడు. మృత్యుముఖంలోవున్న తనకుమారుని ఆ యింగ్లీషు సర్జనుగారే తప్పించగలడని తొలుత నమ్మాడు. అయితే, హేమంతునిమృతితో ఆతనియందుగల గౌరవము నమ్మకము వ్యతిరేకించాయి. ఇప్పు డతనికి నీరదబాబుయం దభిమాన మేర్పడింది. ఆయనేగాక ఆయనగారి రెండవకుమార్తె ఊర్మి మాలగూడ నీరదబాబులో ప్రత్యేకతలేవో తెలిసికొన గలిగింది.

ఒకనాడు ఊర్మిమాల 'నాన్నగారూ! ఆతను వయసులో చిన్నవా డయినా వైద్యంలో యెంతపాండిత్య ముందోచూడు. అన్నయ్యవ్యాధిని గురించి యెంతనిర్భయంగా సిద్ధాంతంచేసి చెప్పా డంటూరు?' అని తనతండ్రి నడిగింది.

'వైద్యం నేర్చుకోనటమంటే కేవలం చదవటమే కాదమ్మా! మనసుతో ఆలోచించి చూచేచూపు కావాలి. అది కొంతమందికి భగవంతుడు ప్రసాదిస్తాడు. అందరికీ లభించదు. కాని, నీరదబాబు కాజ్ఞానదృష్టిఉన్నటులు నేను నమ్ముతున్నా' నన్నాడు రాజారాంబాబు.

అప్పుడయిన వ్యక్తి అకాలమరణం పాలయ్యాడు. ఆ విచారంతో క్రుక్కిపోతున్నా రా తండ్రీకుమార్తెలు. ఆసమ

యంలో నీరదబాబులో కొన్ని మంచిలక్షణాలు వారికి కను
పించాయి. అందుచేత వా రతనిని ఆప్యాయంగా శ్లాఘిస్తు
న్నారు. అటువంటిఅభిమానం అనే విత్తనం వారిహృదయాల్లో
పడినతరువాత కొందరలోనే మొలిచి, పెద్దవృక్షమయింది.
అతనిమాటనుగూర్చి యింక విచారించేపని లేదు వారికి. ఇది
లోకసహజం.

ఒకనాడు రాజారాం ఊర్మిళాలను పిలిచి 'అమ్మాయీ!
హేమంతుడు నన్నుపిలిచి రోగాలచే బాధపడే మానవసమా
జాన్ని రక్షించటానికి ప్రయత్నించుమని చెబుతున్నాడు.
అతనిపేరుపెట్టి 'ఉచితచికిత్సాలయం' కట్టించాలని అనుకుంటు
న్నాను' అన్నాడు.

ఊర్మిళాదేవి సహజానందాన్ని పొందింది. 'మీ
ఆలోచన చాలబాగున్నదండి నాన్నగారూ! నన్ను మీరు
డాక్టరుపరీక్షకు యూరప్పుపంపండి. ప్యాసయి వచ్చి ఆసుపత్రిని
సాగిస్తా' నన్నది.

కుమార్తెమాటలకు తండ్రిమనస్సు స్థానమిచ్చింది.
అంతటితో ఆయనహృదయం ఆశాజనితమయింది.

'ఆసుపత్రి గొప్పసేవచేసే ధర్మసంస్థ తల్లీ! నీవే దానికి
ధర్మకర్తవయితే మంచిది. హేమంతు డెంతో బాధపడ్డాడు.
నీవంటే వాడికి యెంత ప్రాణమో అందరికీ బోధపడివుంది. వాడు
మంచంలోవున్నపుడు తిండీతిప్పలుగూడ మానుకొని రాత్రిం
బగళ్లు వాడిసేవచేశావు. ఆసేవను వా డెప్పుడూ మరచిపోలేదు.
తల్లీ! అలాంటిసేవ యీరోగగ్రస్థులైన మానవులకు నీఅమృత

మయహస్తాలతో, సోదరవాత్సల్యాన్ని చూపి చేయాలి. అలాచేస్తే పరలోకంలోవున్న మీ అన్నకు ఆత్మశాంతి చేకూరుతుంది. నిన్ను ప్రేమించే అన్న యింకెంతగానో సంతోషిస్తాడని అన్నారు రాంబాబుగారు.

శ్రీమంతులయింటబుట్టిన కన్య వైద్యంతో జీవితాన్ని జరపటం హేయంగా భావించలేదామె తండ్రిగారి మనస్సు. దానికికారణం—భయంకరరోగాలనుండి మానవులను రక్షించటం, విలువలేనివృత్తిగా తలంచాడాయన. పండంటిబిడ్డను పాడుచేసుకున్న మీదట తెలిసిందీ రోగులబాధ బాబుగారి హృదయానికి. భీకరవ్యాధిదేనతనోటివాడియైనకోరలలోనుండి తనబిడ్డ బైటపడలేదు. కాని, నాబిడ్డలాంటిబిడ్డలే పరాయివారిబిడ్డలుకూడ వారినయినా యీజబ్బులనుండి కాపాడటానికి చికిత్సాలయంకట్టాలిసిందే! వాళ్ళందర్నీ చూస్తూనయినా యీపుత్రశోకం కొంతమరచిపోవచ్చు; మనశ్శాంతి చేకూరుతుందని నిర్ణయించుకొన్నాడాపుత్రశోకంతో నిండిన తండ్రి.

'ఊర్మిళా దేవి! ముందీ యూనివర్సిటీలో పూర్తికావలసిన 'సైన్సుకోర్సు' కానివ్వు తల్లి! ఆతరువాత నిన్ను యూరపు పంపిస్తాను' అన్నాడాయన కుమార్తెతో.

ఆమాట కామె అంగీకరించింది.

రాజా రాంబాబుగారిమనసులో ఆగోజునుండీ ఒకవిషయం మెదులుతూంది. నీరదబాబంటే ఆయనగారిమనసులో వెలలేనిమణి. ఆ మణిని చూచినకొలదీ రాజా రాంగారిప్రేమ

యినుపాడిస్తోంది. మోకాళ్ళపర్వతం పంటే సామాన్యమయింది కాదు; దాని నెక్కటం చాలకష్టం. పరిక్షలలోఒకొక్కక్క దానిని దాటటంగూడ అలాంటిదే. ఇలాంటికొండలన్నిటినీ కష్టసుఖాల కోర్చి అధిగమించివచ్చాడు నీరదబాబు. వైద్యవిద్యాసాగరంలో గల లోతుపాతులన్నీ గ్రహించాడు. పడుచుదనంలోఉన్నా కోరికలు వానిని బంధించలేకున్నాయి. ఎటువంటిఆనందం ముందు కనుపిస్తున్నా దానికివశపడని నీరదబాబు నిజంగా నీతి వంతుడేగదా!

అంతేకాకుండా, నీరదబాబులో మంచిలక్షణా లింకా యెన్నో వున్నాయి. ఈనాటిపరిశోధనలను జాగ్రతగా గమ నిస్తూనే వుంటాడు. వాటిని తర్కించుకొని పరిశీలించుకొం టుంటాడు. వాటిబలాబలాలు తేల్చుకొంటాడు. ప్రయోగానుభవాలతో మునిగితేలుతుంటాడు. నీరదబాబుకు, ఎలాగయితే నేం శాస్త్ర పలుకుబడి గడించి, ప్రాక్టీసుపెట్టామని, గ్రుడ్డెద్దు లాగా, మరగుజ్జులాగా జీవితాన్నిజరిపే డాక్టరులను చూస్తే మహాలావు అసహ్యం. వాళ్ళతత్వాలమీద లోపాల నెత్తి చూపుతూ, ఎరుగు-బొదుగు లేనివారిని విమర్శిస్తూ గంటలతరబడి మహోపన్యాసాలను దంచేస్తుంటాడు.

ఇంకా అటువంటివారిమీద నీరదబాబు రచించిన యీ పద్యగేయం విన్నారూ?

'వలచును మూర్ఖుల విజయము,
వలచును అర్హులను కీర్తి......'

అయితే యీవాక్యాలలోని సారమూ, అభిప్రాయమూ అతను స్వయంగా చిత్రించినవని అనుకోనద్దు. వారినోటినుంచి వెలువడే ప్రతివాక్యం, ప్రతివిషయం యెక్కడిదా అని ఓపికతో మన మన్ని పుస్తకాలూ ఆమూలాలనుండి యీమూలదాకా తిరగేస్తే ఎందులోనో ఒకదానిలో దొరుకుతుంటాయి. ఇందులో మీ కేమాత్రమూ సందేహంపడాల్సినపని లేదు. ఎందుచేత నంటారేమో, తెంపటం - ముళ్లువేయటంలో ఆయనగారిది ఆరితేరినచేయి. అనేకపుస్తకాలపరిచయంచేతనే అతనివాగ్ధాటి నోరెత్తగలుగుతోంది.

కడసారికి రాజారాంబాబు ఒకనాడు ఉత్సాహాలతో 'మనంచేయబూనిన కార్యక్రమం యేఆటంకంలేకుండా విజయం పొందాలంటే నీరదబాబూ, నేను యీ కార్యరంగంలో ముందు చేతులుకలపటం శ్రేయస్కరమనుకుంటాను. నామనసు స్థిమితపడుతుంది. అలాంటివాడు తొందరగా దొరకడు' అని అన్నాడు.

ఏవిషయంలోనూ హేమంతుని సిద్ధాంతాలకు వ్యతిరేకంగా నడవటమంటే రాజారాంబాబుకు గిట్టదు. అది ఆయనకు సాధ్యంకాదుకూడా. వివాహాదివిషయాల్లో పిల్ల యిష్టాన్నే పూర్తిగా అనుసరించాలనీ, లేకపోతే మంచిదికాదనీ హేమంతుడు చెప్పేవాడు. పెండ్లికుమారుని నిర్ణయించే పెళ్ళికూతురి అధికారంలో మన మెవరమూ పాలుపంచుకోరాదని చెప్పేవాడు. పెళ్ళిఅంటే ఒకవ్యక్తికి సంబంధించిన దేమీ కాదనీ, యింటియొక్క పరువు మర్యాదలుగూడ దానిలోనేదాగియున్నా

యనీ, కావునవివాహంచేయించేసందర్భంలో పిల్ల అభిప్రాయమే గాక అనుభవజ్ఞులయిన యింటిపెద్దలకుగూడ అధికారముండాలనీ రాజారాంబాబు హేమంతునితో తర్కించాడోకనాడు. కాని రాజారాంగారి యిష్టాయిష్టాలు, ఆయనగారి ప్రతిఘటనలు చివరకు ఫలించేవి కావు. కారణ మేమిటంటే- హేమంతునిమీద తండ్రిగారికి అపార ప్రేమాభిమానా లున్నాయి. కావున ఆయింట్లో హేమంతునిమాట చెల్లితీరాలి.

రాజారాంబాబు నీరదబాబుయం దభిమాని, కాబట్టి తరచు వారింటికి వస్తూంటాడు. నీరదముఖర్జీకి హేమంతుడు తారకాసురు డనే బిరుదు యిచ్చాడు దాని అర్థం గుడ్లగూబ. ఈపేరుపెట్టటానికి కారణ మేమిటి అని యితరు లడిగినపుడు 'వీడు పురాణపురుషుడు. వీడికి వయసునుమించిన విజ్ఞానం బాగా వుంది. ఇంగ్లీషుశాస్త్రాలనుబట్టిచూస్తే విద్దెలరాణి అయిన మినర్వాదేవికి గుడ్లగూబే వాహనం. కాబట్టి వీడి కాపేరు నియమించాను' అని చెప్పేవాడు, హేమంతుడు.

వేళఅయేసరికి టీఅతిథినంటూ నీరదముఖర్జీ హాజరయ్యేవాడు. అప్పుడప్పుడు హేమంతునికీ అతనికీ భయంకరమైన వాదోపవాదాలు జరుగుతుంటాయి. ఆఘట్టాలలో నీరదబాబు మనస్సునందు ఊర్మిమాల అనుమానంలేకుండా మెదులుతూండేది. అయితే, ఆవిషయం బైటకు తెలియనిచ్చేవాడు కాదు. అది అతని స్వాభావికమైన బుద్ధికాకపోవటమే కారణం. ఆలోచనాశక్తి వానికి లేదు. వానిలో ఉత్తేజమైన యౌవనం లేకపోలేదు. అయితే, ఆయౌవనానికి కళలుతక్కువయ్యాయి. పరు

లెవరైనా యూవనోద్రేకులు మాటలాడటం, యేదైనాజరిగితే నీరదబాబు ఆసంఘటనను నిరాదాకరంగా వాదించడంలో చాల సరదాగా పట్టుదల చూపేవాడు. ఆకారణాలచేత అతను ఊర్మి మాలాదేవిని పెళ్ళాడటానికి ఉబలాటపడుతున్నట్లుగా యితరులు భావించేఅవకాశం లేకపోయింది. అటువంటి నిశ్చలతత్వం అతనిలో ఉన్నటుల గ్రహించిన ఊర్మిమాల కాతనియందు గౌరవం కలిగి, చెప్పరాని పూజ్యభావంకూడా యేర్పడింది.

'ఊర్మిమాలాదేవి! నీవు సర్వతోముఖంగా నీరదబాబును వివాహమాడటానికి అంగీకరించితే, మీయిద్దరికీ ముడిపెట్టడం నాకు సంతోష' మని రాజారాంబాబు మనస్ఫూర్తిగా చెప్పాడు. అప్పు డామె తలూపి తన కే అభ్యంతరమూ లేదని తండ్రికి తెలియచేసింది. అయితే ఇచటిచదువు, యూరపులో చదువు పూర్తి అయేవరకు ఆగి, తరువాత పెళ్ళిచేసుకుంటానని ఒక ఆంక్ష పెట్టింది.

'అలాగే కానివ్వుతల్లీ! వధూవరులిద్దరూ అంగీకరించి అనుకూలనిర్ణయానికి వచ్చి స్థిరపరచుకొన్నతరువాత దీర్ఘకాలం వాయిదాపడితేమాత్ర మేం?' అన్నాడు రాంబాబు.

అయితే, యికనీరదబాబుఅభిప్రాయంగూడా రాజారాం బాబుగారు తెలుసుకోద్దూ?–నీరదబాబుతో చాలమంది 'డాక్టరు గారూ! శాస్త్రంచదివినవాడికి పెళ్ళిచేసుకోవటం తన్నుతాను ఖూనీచేసుకోవటమే' అని చెప్పారు. నీరదముఖర్జీ ఆమాటలు లెక్కచేయకుండా ఊర్మిమాలను వివాహమాడటాని కంగీకరిం

చానని వెంటనే జవాబు చెప్పాడు. అయితే ఊర్మిమాలను చదివించటంలోను, ఇంకా వేరువిషయాలలోగూడా అతని అధి కారమే సాగాలని స్పష్టీకరించి చెప్పేశాడు. అలాగయితేనే క్రమంగా ఆమెను కాబోయే తనయిల్లాలుగా యేర్పాటుచేసు కుంటానన్నాడు.పరిశోధనాలయంలోని క్రమశిక్షణమాదిరి యీ తర్ఫీదుకూడా శాస్త్రసమ్మతంగా కఠిననియమావళికి కట్టుబడి వుండాలని అన్నాడు.

'విశాలమయిన ప్రకృతీదేవికి జన్మించిన పక్షులు, జంతు వులు. పశువులు మనుజీవితాన్ని బోలినవి కావు. ఆసృష్టిని ఒక ముడిపదార్థాన్ని బోల్చుకొని, దానికి ఆకారంచేకూర్చేవంతు మనుష్యునిది' అని చెప్పాడు నీరదబాబు.

మృదుస్వరంతో 'తమయిష్టంవచ్చిన ప్రయోగాలు ప్రయోగించటానికి నే నభ్యంతరం చెప్పను' అన్నది ఊర్మి మాల.

'నాజీవితకృషి సర్వతోముఖాలుగా విస్తరించింది. ఇక నీజీవితాన్ని యేకైకలక్ష్యంగా రూపొందచేయటానికి నాజీవిత శక్తిని సమీకరించి సురక్షితంచెయ్యాలి. అది పూర్తిగావించిన నాడే నాజన్మ ధన్యమవుతుంది.

చీకాకుగాపడివున్నజీవితశక్తిని ఒకేఒకరూపంచేయటానికి మనస్ఫూర్తిగా యేకత్రితంచేసిననాడే – అది ఉత్తమముగ, మహోత్తమముగ యేర్పడిననాడే – మనం దానిని సహజరూ పాన్ని పొందినట్లు చెప్పగలుగుతాం' అని మహోపన్యాసాన్ని దంచేశాడు డాక్టరు నీరదబాబు.

ఊర్మిమాల దేహమంతా గగుర్పొడిచింది. ఆయన వెంట టీ త్రాగటానికి చాలమంది స్నేహితులు వచ్చారు; ఆయన చెన్నీసుక్లోస్టులోనిమిస్త్రేసులెందరో వచ్చారు. ఇంతమందివున్నా నీరదబాబు మాటలకు యెదురు చెప్పినవారు లేరు. ఎవరు కింత చేతయినా వేయలేకపోయారు. ఆయనగారిమాట లేమీ అర్థం కాక ఆకాశంవంక చూడసాగారు.

నిజానికి నీరదబాబు త నోటినుండి దేనిని వెలువడచేసినా దానిలో ఉత్తేజమును, లోతైన భావమును, గొప్పవిజ్ఞానాన్ని సమకూర్చటం చేతనగును. ఊర్మిమాల ఆ అద్భుత మేధస్సును గమనిస్తుంటుంది.

రాజారాంబాబు యెక్కువగా పెద్దల్లుడిని తనింటికి రమ్మంటూవుంటాడు. వడ్డకులిద్దరిలోను స్నేహభావాలుకలగటానికి ప్రోత్సాహాలు చేస్తుంటాడు.

శశాంకుడు తనభార్యతో నీరదబాబునుగురించి 'ఎంత ఆ సోదివాగుడుకాయి? మనమంతా పీడిసగ్గర శాఖాలు చదువుకునేకుఱ్ఱాళ్ళ మన్న మాట!' అన్నాడు.

'మీరు రసూయపడుతున్నారుకాని, అతనంటే నాకెంతో అభిమానం' అని అంది శర్మిలాదేవి శశాంకునితో.

'అలాంటప్పుడు మీ 'అక్కా - చెల్లె'ళ్ళిద్దరూ మీ మీ స్థానాలు మార్కుంచేసుకోరాదూ?' అన్నాడు మజుందార్.

'అలాజరిగితే మీరు రానందిస్తారుకాని; నా కది లభించదుగా' అన్నది శర్మిలాదేవి.

పోనీ, నీరదబాబుకైనా శశాంకునిమీద సోదరాభిమాన మున్నదాఅంటే - అదీ లేదు. నీరదముఖర్జీ 'ఆc! తాపీ

పనివాడేగా? నాలాంటి సైన్‌టిస్టా? కాదు. అతనికి చేతు లున్నాయి– నాకు బుద్ధి వుంది' అని తనలో తా ననుకొన్నాడు.

శశాంకుడు మరదలిని తరచుగా నవ్విస్తుంటాడు. 'ఈ పాటికి నీపేరు మార్చుకుంటే బాగుండేది' అన్నాడు.

'ఆంగ్లేయులమాదిరా?' అన్నది ఊర్మిమాలాదేవి.

'ఎబ్బే! సంస్కృతంలో' అన్నాడు శశాంకుడు.

'ఆనూతననామం సెలవియ్యండి!' అన్న దామె.

'విద్యుల్లత!–ఆఁ! కాదు ఊర్మిమాలా! ఆపేరు డాక్టరుకు చాలయిష్టం. వాని కా లేబొరేటరీలో విద్యుత్ అవసరంకూడా. ఇపుడు యింటిదగ్గరే దానికి జీను, కళ్ళెం వేసి తయారుచేసు కోవలసినపని వస్తుంది' అన్నాడు శశాంకుడు

శశాంకునిమనసులోమటుకు విద్యుల్లత అనటం మరదలికి తగిననామధేయంగా భావించేవాడు. 'బంగారంలాంటి పిల్ల డంబాలరాయుడుచేతుల్లో పడిపోతోందే' అని తనమనసులో తీరనిబాధపడేవాడు. పోనీ, తనకు తృప్తి, సంతోషం కలిగే లాగా ఊర్మిమాలాదేవికి తగినసంబంధం యిదిఅని నిర్ణయించే శక్తి ఆయనకున్నదా అంటే–అదీ లేదు.

మరికొద్దిరోజుల్లో రాజారాంబాబుకూడా మరణించాడు. జరుగబోయేదానిమీద ఊర్మిమాలాదేవికి సరియైన స్వాతం త్ర్యాధికారం వుంది. ఆ ఊర్మిమాలబుద్ధికి మెరుగులుదిద్దే కార్యభారాన్ని నీరదబాబు కోరి తలమీద వేసుకున్నాడు.

పుట్టుకతోనే ఊర్మిమాల చాలఅందగత్తె. ఇపుడు ఆమెలో అందం యింకా రాణించింది. ఆమె తనలోని మనో

వికాసాన్ని, మనోబలాన్ని ఒలకపోసే వ్యాయామపువడకలు నడుస్తుంది. ఆమెకు అక్కరలేనిది లేదు. అన్నిటినీ అవగాహన చేసుకోవా లనే అభిరుచి ఆమెలో ప్రబలిపోయింది. విజ్ఞానం మీద ఆమెకు ప్రేమ; సాహిత్యంమీద అంతకంటేను. ఫుట్ బాల్ పోటీలు చూట్టానికి మైదానంమీదికి ప్రయాణమంటే సరదాగా ముందు మిగులుతుంది. సినిమా లేవయినా చూడ దంటూరా అందులోనూ ఆమెదే అగ్రస్థానం. ప్రెసిడెన్సీకాలేజి లోని కెవరో యూరపునుండి వచ్చి పదార్థవిజ్ఞానంమీద ఉపన్యాసమిస్తున్నట్లు తెలిస్తే తనసీటు ముందే రిజర్వు కావాలి. ఎప్పుడో వొకసారి 'ఇస్సీ! అబ్బా! అన్నా' రేడియో వార్తలను వినకుండా పోనివ్వదు. కనీసం పెళ్ళివా ళ్ళెవరయినా బాజాభజంత్రీలతో వారివీధిని పోతుంటే– ఆమె వరండాలో నిలుచుని పెళ్ళివారిని, పెళ్ళికొడుకుని తప్పకుండా చూస్తుంది.. మృగప్రదర్శనశాలలకు బోయి, బోనులులాంటి పంజరాలలో చిందులువేసే కోతులను చూడటం ఆమెకు యెంతో ముచ్చట. తనతండ్రిగారితో చేపలుపట్టటానికి పోయేది. అన్నగారితోబాటు టెన్నిసు – బ్యాట్ మెంట్ – నిపుణత్వంగా ఆడేది. అన్నగారే చాలాఅలవాట్లు నేర్పాడు.

ఆమెశరీరం బంగారుతీగెలా మెరుస్తుంటుంది. లతలాగున గాలికి వూగుతుండేది. సాధారణమైన బట్టలు ధరిస్తుంది. చీర కట్టటంలోమాత్రం యెక్కడ యేమడత రావాలో, అక్కడా మడత వచ్చేలాగా కట్టుతుంది. ఆకట్టు యితరులకు చేతకాదు. పాటలో అంతప్రావీణ్యం లేకపోయినా సితారావాద్యంలో

మటుకు మంచిఅనుభవం వుంది. ఆమెవాయించే సితారా నాదం వినటంకాకుండా తినటం కూడాఅయితే బాగుండు నని పిస్తుంది. సితారామీద ఆమె వ్రేళ్లు నాట్యమాడుతుంటాయి.

ఆమెమాట్లాడేవిషయం ఒకటిగా వుండదు. నవ్వదగిన సమయమేదో తెలియనే తెలియదు. ఏమీఆలోచనిసమయంలో కారణంకల్పించి మిత్రులతో ప్రొద్దుబుచ్చే చాకచక్య మామె కుంది. సందడిలేనిప్రదేశాన్ని కూడా తనమనోహరస్వరూపాలతో కళకళలాడించగలదు. అయితే, డాక్టర్ నీరదబాబుముందు మాత్రం యీచలోక్తికి భంగంకలుగుతుంది. గాలిలేని తెర చాపమొక్క చాలీచాలనిబలంతో నడిచే పడవలాగున మెల్లగా నడుస్తుం దామెటీడ.

ఊర్మిమాలలోని ఆ ప్రోత్సాహం, ఆ చైతన్యం, ఆ సంతోషాలన్నీ మూర్తీభవించినట్లుగా హేమంతుడే అని యెవరయినా అంటుంటారు. అయితే, ఆ అన్నగారిప్రబోధంవల్లనే తనలో యీప్రకాశంకలిగిందని ఊర్మిమాలఆత్మవిశ్వాసం.

'మనుష్యులను బంకమట్టిప్రతిమలులాగున తయారుచేసే పెద్దమూసలలాంటిది మనకొంపలు. కాబట్టే ముప్ఫైమూడు కోట్లప్రజల నా పరదేశీయమాయలమారిమరాటి బొమ్మలాట లాడిస్తున్నాడు. సమయంరాగానే కాలాపహరుడుమాదిరి నే నీచిత్రాలరాజ్యాన్ని చిత్రవధతో గందరగోళంచేసేస్తా' అని పలుకుతుండేవాడు హేమంతుడు. అయితే, అంతప్రళయం రాలేదుకాని, చెల్లాయిమనస్సును సజీవంచేసినతరువాత పోయాడు యీలోకాన్ని విడిచి.

కాలాపహాడ్ అంటే ఎవరో అనుకుంటారేమో—ఆయన ఒక బెంగాలీ బ్రాహ్మణుడు. హిందూమతంనుండి ముసల్మాను మతం స్వీకరించాడు. మహమ్మదీయ ప్రభువుదగ్గర సైనికుడుగా వుద్యోగం చేశాడు. రాజాజ్ఞ ప్రకారం భారతీయుల దేవాలయాలను పాడుచేసి, దేవతావిగ్రహాలను భంగంచేశాడు. అందుచేత 'విగ్రహవిధ్వంసకు' డని వానికి పేరువచ్చింది.

నీరదబాబు ఊర్మిమాలకు కార్యక్రమాన్ని కఠినశాసనాలతో నిర్ణయించి ఆమె నందులో నడిపించటమే మొదటికి తిప్పలు తెచ్చింది.

'ఊర్మి! నీ పీ జీవితంలో వున్నదానినంతా యివ్వాళే పారబోసుకుంటున్నావు. ఈయాత్ర పూర్తి కాబోయేటప్పుడు యేమి మిగిలించుకుంటావు? నీమనస్సును కళ్ళెంలేని బలమైన గుఱ్ఱంలాగా పరుగెత్తనీయకు. సీతాకోకచిలుకవలె అహోరాత్రిళ్ళూ ఫలితంలేని ప్రయాస పడుతావు. తేనెటీగమాదిరిగా నీవు తయారుకావాలి. జీవితమంటే ఏమిటో నీకు తెలియలేదు. దానిలోని ప్రతిక్షణానికీ విలువుంది' అని నీరదబాబు ఊర్మిమాలను మందలించాడు.

నీదరబాబు యిటీవల బోధనాశాస్త్రాన్ని నుసరించిన గ్రంథాలన్నీ అపరిమితంగా చదువుతున్నాడు. ఆపుస్తకాలన్నీ యింపీరియల్ గ్రంథాలయంనుండి సభ్యత్వంమీద తెచ్చినవే! అతను చెప్పిన న్యాయసూక్తులన్నీ ఆగ్రంథాలలోనివే! పూర్తి గ్రాంధికభాషే. వానినోటినుండి వస్తూంటుంది. దానికొక కారణముంది. సంగతులను క్రొత్తమాటలతో విశదీకరించి

సులభంగా చెప్పటం అతనికి అసాధ్యమైనపని. ఊర్మిమాలాదేవి దే లోపమని అంటూంటాడు. ఆసమయంలో ఆమెగూడా తల వంచుతుండేది. గొప్పకార్యాన్ని సాధించేభారం తనమీద వేసు కుంది ఊర్మిమాల. అయితే ఆదృష్టినుండి ఆమె తరచు తప్పి పోతూవుంది. అది తెలుసుకొని యెంతో పశ్చాత్తాపపడుతూ వుంది.

ఆదర్శంగా నీరదబాబును చూడు. కార్యదీక్షయం దసా ధారణపట్టుదలగల మనిషి. తనచూపు మరోజగత్తులోనికి ప్రస రించనయినా ప్రసరించనీయడు. తేలికమాటలకూ, చతురులకూ చాలా దూరంగా వుంటాడు. ఊర్మిమాలాదేవి డ్రాయరుమీద డిటెక్టివ్ నవలలాంటి యే యితరపుస్తకమువున్నా మరుక్షణంలో దానిని ఖైదీచేస్తాడు. ఒకనాడు ఆమె ఆంగ్లేయథియేటరుకి పోయింది- గిల్బర్ట్, సల్లివాన్ కవులు రచించిన 'మికడో' అనునాటకం చూడటానికి. అదేసమయంలో నీరదబాబు ఊర్మి మాల యేంచేస్తోందో చూడాలని ఆమెయింటి కొచ్చాడు. అయితే హేమంతుడు బ్రతికివుండగా ఆమె యిలాంటివి తప్పక చూచేది. ఆ అలవాటుప్రకారం పోయినందుకుగాను నీరదబాబు ఆమెను యిష్టంవచ్చినట్లు చివాట్లుపెట్టి యింగ్లీషులో యిలా బ్రహ్మాండంగా యుపన్యాస మిచ్చాడు:

'మృతిచెందిన నీసోదరుని ఆత్మశాంతి కేది చేయా లను కున్నావో, నీజీవితాన్ని దాని కెలా అంకితంచేయాలని నిర్ణ యించుకున్నావో దానిని మరచిపోతున్నావ్.'

ఆమాటలతో ఊర్మిమాలహృదయానికి తూట్లుపడ్డాయి. ఆమెహృదయంలో 'ఎదుటిమనిషిమనసులోని ఆలోచన లర్థంచేసుకునే గొప్పవిజ్ఞానశాలి యితడు. నామనోదుఃఖం నిర్ణయించిన పనిని చేసేశక్తిని గోల్పోయినాను. అది నా కర్థం కాలేదుకూడ. నాలోని యీబలహీనత గ్రహించలేనందుకు నే నిపుడు సిగ్గుపడవలసివుంది' అని అనుకుంది.

ఆనాటినుండి తనబట్టలయందుచూపే శ్రద్ధనంతా మీక్షోలు చేసి, దీక్షపట్టినమునికన్యలాగె తన్ను తాను నిర్దయతో దండించుకొనసాగింది. పరీక్షించుకొనట మారంభించినది. మొద్దుచీర కట్టుతుంది. ఇదివరలో రంగుచీరెలంటే ప్రాణాలుఒదిలేది. కాని, యిపు డాకోరికను సాధించి, బంధించి, కట్టగట్టి యే స్థంభానికో చుట్టచుట్టివేసింది.

అక్కగారు ఆమెను చివాట్లువేసింది. బావగారు తన ప్రియునిపై వినరాని అవినీతిమాటలను విసిరాడు. ఆమాటల కర్థ మే నిఘంటువులలోనూ లేదు. అయినా, నీరదబాబుకూ శశాంకుడికీ ఒకవిషయంలో పోలికచెప్పవచ్చు. శశాంకుడికి మితి మించినకోపం రాగానే యింగ్లీషులో మొదలెడతాడు తిట్టటానికి. అలాగే మరొకగంభీరమైనదానినిగూర్చి చెప్పాలన్నా యింగ్లీషునే తెచ్చిపడేస్తాడు. ఏకారణంగానైనా ఊర్మిమాలా దేవి చెల్లెలుగదా అని శర్మిలాదేవి తనయింటికి రమ్మనమంటే శశాంకుడు సహించేవాడు కాడు. బావగారింటికి వెళ్ళటమంటే ఊర్మిమాలాదేవికి మితిలేనిఉబలాటం. అంతఉబలాటంచూస్తే నీరదబాబుకు బ్రహ్మాండమైన కోపం. మరి, శర్మిలాదేవికీ

ఊర్మిమాలా దేనికీ రక్తసంబంధమయిన ప్రేమ! ఆసాంగత్యం నీరదబాబు ఆజ్ఞాపాశాలనుకూడా త్రెంచుకుంది. ఆకారణంగా నీరదముఖర్జీముఖం భయంకరాకారాన్ని పొందింది.

ఒకనాడు నీరదబాబు ఊర్మిమాలతో ‘నే నిలా కఠినం దాల్చి మాటాడటం నీపయి నాకున్నటువంటి బాధ్యతచేతనే గాని, వేరుగా భావించకు ఊర్మి! మీ అక్కా, నీకూ నడుమ యేర్పడిన యీసాంగత్యం నీహృదయం లో ఆశయాలకూ, నీఅభివృద్ధికీ హానిచేకూరుస్తాయి అని గట్టిగా హెచ్చరిస్తున్నాను; హెచ్చరించాలికూడా. ఈయింటిసంబంధం నన్నొకఅంధుని చేస్తోంది. నీవు ముందు పతనంకావటం నేను చూడవలసి వస్తుంది’ అని అన్నాడు.

ఊర్మిమాలజీవితమనే దొక స్థిరాస్థి. దానిమీద తాకట్టు వుంది. అది నీరదబాబుపేర వ్రాయబడుటచేత అతనియినుప పెట్టెలోనే చిక్కబడింది. ఆమెలో యేలోటుగలిగినా నీరద బాబు నష్టపడతాడు. కాబట్టి అతనుచేసే ఆజ్ఞలకట్టుదిట్టంతో ఊర్మిమాల భవానీపురంపోవటానికిప్పుడు సూత్రం దొరకటం లేదు. అందుచేత అక్కగారూరువెళ్లటం చాలతగ్గిపోయింది. ఈబాధలేకుండా, తానీసన్యాసత్వాన్ని దాల్చకుండా స్వేచ్ఛగా వుండటానికి తనమీదనున్న నీరదునిఅధికార మనేతాకట్టుపత్రం మీద రద్దువ్రాయించుదామా అంటే – అతను మంచిశాస్త్ర వేత్త. తనజీవితమంతాభరించటానికి పూనుకొన్నాడు. విడనాడే దెలాగా?

ఆటపాటల్ని పరిత్యజించి, మునిరాణిలాంటి నిష్ఠలో కార్యసాధన కాత్మార్పణంచేసినా, ఒకొక్కసారి బుద్ధి అటు

వైపు మరలుతూనే వుంటుంది. తనవాంఛనలను ఆమె పూర్తిగా నివర్తిచేసుకోలేకపోతోంది. నీరదబాబు ఇంతవరుక తన కాదర్శ ప్రాయుడులాగ ప్రవర్తించటంతప్ప తన మమకారాన్ని చూపడెందుకనో?

'నీరదబాబు ప్రణయకలాపంలో దిగకపోతాడా?' అని యింతకాలం ఆశతో నిరీక్షించింది ఆమన సెంతో ఆరాటపడింది. అటువంటిఅనురాగచిహ్నలేమీా కనుపించకపోవడంతో ఆమెమనోవాంఛ లలాగే నిలిచిపోయాయి నిండుమోదం చెందలేకపోయింది. ఆమె చేయగలిగినకార్యాలుకూడ సారం లేని యెడారిస్వరూపాన్ని ధరించాయి. ప్రియుడు మాటలాడే సమయంలో ఉన్నట్టువుండి ఉత్సాహాన్ని ప్రకటించినప్పుడు అతని ప్రేమఫలాలను ఒలిచి తనముందు పెట్టబోతున్నాడని భ్రమించేది. కాని, వానిహృదయంలో యేకోశానైనా, యేమాత్రమయినా ప్రేమ వున్నదా? లేదా? అనే ప్రశ్నకా దేవుడే జవాబుచెప్పాలి. ఒకవేళవున్నా దానిని తెలియచేసే చదువాయన చదువుకోలేదు. అందుచేత ఆ కాంక్షను దోషమనేవాడు. ఆందోళనాన్ని దాచిన తననిరుత్తవువే ఆయన ఘనమనుకొనేవాడు.

ఆమహానవ్రతం తనప్రవర్తనకు పటుత్వమని ప్రమాణంగా విశ్వసించాడు. కామమనేది తనలో యేమాత్రమూ లేదని చాటించేవాడు, డాక్టరు నీరదబాబు. అటువంటప్పుడు ఊర్మిమాలాదేవికి దుఃఖంవచ్చేది. అయితే, మంత్రంచేత కట్టుబడిన పాములాగా యిదికూడా పురుషత్వానికి యథార్థమైనలక్షణ

మేమో నని తలంచేది. ఆతరువాత పటుత్వంలేని తనబుద్ధిని కఠి నంగా శాసించుకుంటూ వుండేది. అన్నగారు మృతిచెందిన వెంగతో తనుమనస్ఫూర్తిగా యీలోకోపకారకార్యాన్ని ఆమె తనతలమీద పెట్టుకుంది. దానియందు తన కేర్పడిన శ్రద్ధాభ క్తులు క్రమేపీ సన్నగిల్లుతున్నాయి వాటినిసాధించటానికి ఆమె యితరులసహాయాన్ని పూర్తిగా అర్థించవలసివచ్చింది. ఈ విప రీతసమస్యలకు మూలమైన విషయాన్ని ఆమె మరువలేక పోతూంది.

'ఊర్మిమాలా! సామాన్యమయినకన్యలు మగవారినుండి వాంఛించే ప్రయోజనంమాలిన పొగడ్తలు నానుండి పొందా లనుకోబోకు. అటువంటి వే మాత్రము నేను చూపలేను. పైకి తియ్యగావుండే విషపూరితమైనఫలాలు నేను యివ్వను. సత్య స్వరూపంలో యెన్నోరెట్లు ఉత్తమసలహాలిస్తున్నాను' అని నీరదబాబు స్పష్టంగా చెప్పాడు.

ఊర్మిమాల శిరస్సు వాల్చుకుంది. విభ్రాంతిచెందిన హృదయంతో 'ఈమనిషికి గోచరించకుండా దాచటానికి సాధ్య మయినవిషయమంటూ ఒకటైనా వుంటుందా?' అని అను కుంది.

తనబుద్ధిని యేవస్తువుమీదనయినాసరే స్థిరంగానిలుప లేకపోయింది. డాబామీది కెక్కి పచారులుచేసేసందర్భంలో యేకాంతంలో వుండటాన్ని కోరుతుంది. ఎండతీవ్రంతగ్గి సంధ్య వేళ సమీపిస్తుంది. పట్నాలల్లో భవనాలు విశేషమయిన ఎత్తులో వుంటాయి. ఆ వున్నతమైన మేడలమీదనుండి పరు

గత్తి, గంగానదిపైన నిండివున్న పడవలయొక్క తెరచాపల నంటియుండు కోయ్యస్థంభాల కొసలగ సూర్యుడు నిష్క్రి మణద్వారమగు పశ్చిమాద్రిని సమీపిస్తున్నాడు. పగటి సామ్రాజ్యంమీద వివిధమేఘసేనానాథులు రంగురంగుపతా కాలతో శత్రుసేనలను పురిగొల్పినట్లు గగనంబు కన్పించుచు న్నది. చందమామ క్రైస్తవుల ప్రార్థనాలయశిఖరాన్ని యెక్కుతున్నాడు. చంద్రుడు రాబోయేముందున్న అడ్డకట్టల లాంటి మేఘాలు వరుసగా తప్పుకుంటున్నాయి. ఆపట్నంమీద పొగమంచు క్రమ్మింది ఆవెలుగులో నగరం కల మాదిరిగా, మంత్రించబడిన నేలలాగా ఊర్మిమాలకు కనుపిస్తుంది. నిజ మాలోచిస్తే బ్రతుకులో సంధి లేదా- అని ఆమె విచారపడు తూంది. విశ్రాంతి ఆనందం ప్రసాదించనిది, జాలిలేనిదికూడా జీవితమేనా? ఇలా ఉన్మత్తతోగూడిన ఆలోచన లామెకు కలుగు తున్నాయి. ఆపరిస్థితిలో ఆమె 'యేదో సాహసంచేస్తూ లను కుంటుంది. 'నేను దేనికీ దడువను' అని కేకలువేయా లను కుంటోంది.

## ఊర్మి మా లా దే వి

ఆయన మొదలెట్టిన శాస్త్రపరిశోధనలో నీరదబాబు విజయంపొందాడు దానిని గురించి తయారుచేసిన సిద్ధాం తాన్ని యూరపునందున్న శాస్త్రీయసంస్థకు పంపించాడు. అచటివా రా పరిశోధన కానందించి స్కాలర్‌షిప్‌గూడా యిచ్చారు. సముద్రాలనుగూడ దాటి యూరపునకు పోయి యూనివర్శిటీలో పదవిసంపాదించా లనుకొన్నాడు నీరదబాబు.

ప్రయాణకాలంలోగూడా అతను మృదువుగా ఊర్మి మాలతో సంభాషించాడా అంటే - లేదు. 'నీవు నీకార్యంలో అశ్రద్ధలపాలుకాకుండా జాగ్రత్తపడు. నేను వెళ్లుతున్నా' నని మాత్రమే చెప్పాడు

'ఆఁ! సందేహపడకండి' అన్న దామె.

'ఇకముందు నీజీవితాన్ని నడిపేఅధ్యయనం వ్రాసియిచ్చి వెళ్ళుతున్నా' నన్నాడు నీరదబాబు.

'అడుగుతప్పకుండా ఆచరిస్తా' నన్న దామె.

'ఈపుస్తకాలన్నీ నీఅలమారులోనుండి తీసి, నాగదిలో దాచివేసి, వెళ్తా'నన్నాడు నీరదబాబు.

'వాటిని మీరు తీసికొనవచ్చు' నంటూ ఊర్మిమాల తాళంచెవు లందించింది, వానిచేతికి.

సితారాను సర్దేటప్పుడుమాత్రం ఆమె కొంచెం కట కటపడింది. అయినా పైకి యేమీ అనలేదు. నీరదబాబు వెళ్ళుతూ నాలుగుచివాట్లయినా వేసి పోవటం తన కామెయం దున్న బాధ్యతకు లక్షణ మనుకున్నాడు.

'నన్ను పట్టుకున్న దొకే ఒక బాధ. మాటిమాటికీ నీ వా శశాంకబాబుగారింటికి పోయి, నీ మనస్థిమితాన్ని పాడుచేసుకుంటా వనే ! నామాటల్లో అబద్ధం లేదు. నే నీ మాట లనటం మీబావగారిమీద యేదోమచ్చ కలిగించాలని అంటున్నా ననుకోబోకు. అత నెంతో మంచివాడు. మన బెంగాలీవ్యాపారులలో ఆయనమాదిరి తమపనిమీదశ్రద్ధ

చూపేవారు చాలతక్కువ. ఆయనలోని పనికిరానితనమంతా ఆదర్శాలమీద విముఖత్వంచూపటం మాత్రమే. యథార్థానికి తరచు ఆయననుచూచి నేను జంకుతుంటాను' అని చెప్పాడు నీరదబాబు.

డాక్టరీ విధంగా చెప్పమొదలిడిన శశాంకునిమీది యుపన్యాసం అతనిలోనిలోపాలను విమర్శించటానికి అవకాశమిచ్చింది. 'ఇప్పటివరకూ శశాంకునియందు నిద్రపోతూవున్న తప్పిదాలు ముందెప్పుడైనా ఒకనాడు అతనివయస్సు కనుపించి నట్లే లోకానికి కనుపించి తీరుతాయి'అనే మాటను నీరదబాబు తనకడుపులో యిమిడించుకోలేకపోయాడు. ఇంతగా యిట్లా అన్నప్పటికీ 'శశాంకు డొక ఆశ్చర్యకరమైన వ్యక్తి' అన్నాడు ముఖర్జీ. అయినా నీవుమాత్రం కోరరాని శశాంకునిస్నేహబంధాలనుండి నిన్ను విడిపించుకోవాలి. వా రుండేదశలో నీ హృదయాన్ని తగ్గించుకున్నావంటే నీవు అథఃపతనమైపోతావు ఊర్మీ!' అని నీరదబాబు హెచ్చరించాడు.

'కాని, తమ రింత భయపడతా రెందుకు?' అని ప్రశ్నించింది ఊర్మిమాల నీరదబాబును.

'చెప్పేదా? నీ కేమీ కోపంరా దంటే చెప్తాను' అన్నాడు మళ్ళీ నీరదుడు.

'కఠినతనం దాల్చటం అలవాటుచేశారు. సహింపరానిదైనా సహిస్తున్నాను' అన్నది ఊర్మిమాల.

'అయితే విను. శశాంకబాబు మనసుకీ, నీమనసుకీ సన్నిహితమున్నటులు నే నూహించాను. వానిలోవుండే బాలమనోస్వరూపం నీబుద్ధిని సులభంగా ఆకర్షించింది. అవునా?' అని అన్నాడు.

'సర్వాంతర్యామి' అంటే యీ వ్యక్తిలాంటివాడేనా అని విభ్రాంతి చెందింది ఊర్మిమాలాదేవి. అందులోనూ విశేషంగా పసిపాపలు నవ్వినట్లుండే శశాంకుని నవ్వన్నా, అతను చూపే ఉల్లాసాలన్నా, అతనిహాస్యపుమాటలన్నా తన కెంతో యిష్టం! ఇంకా తనకు యేపూలమీద మోజో; తాను యే రంగుచీర శ్రద్ధగా కట్టుతుందోకూడా బావగారికి బాగా తెలుసు.

'నిజమే! నాకుకూడా అదే యిష్టం' అని జదులు చెప్పింది ఊర్మిమాల.

'ఎంతోనిర్మలమయింది శర్మిలాదేవిప్రేమ. అగాధమైనది కూడా. ఆమెభక్తిశ్రద్ధలు పునీతమైనవి. తనధర్మాన్ని పాలించటంలో అలసటే పొందదు. శర్మిలాదేవిలోని సుగుణాలకారణంగానే శశాంకబాబు తనబుద్ధినంతా వుపయోగించి వ్యాపారం చేస్తున్నాడు. అయినా, భవానీపురం నీవు త్రొక్కితే ఆతనిలో వుండే యీవికాసం మారిపోతుంది. సహజంగా అతనిరూపమెలాంటిదో తేలిపోతుంది. అక్కడనుండి ఆయనగారుచేసే మహాకార్యాలు- నీతలలో ఉన్న ఒంకులపిన్నుల్ని తీయటం; నీ జడను పట్టి గుంజటం; చేతిలోని పుస్తకాలను తీసి, అలమారు పైన మరుగుపెట్టి నిన్ను తిప్పలుబెట్టుతూ చిలిపిచేష్టలు చేస్తుం

డటం! ఎంతఅవసరమైనపనులున్నా, అవన్నీ మరచిపోయి నీతో టెన్నిస్ కోర్టుకు హాజరవుతాడు. నిన్ను కళ్ళతో చూడగానే మీబావగారిమనసులోని రూపమంతా బహిరంగం చేస్తాడు' అని నీరదబా బన్నాడు.

'అతను ప్రకటించే యీచిలిపిపనులే తనమనసు నా శశాం కునివైపుకి ప్రసరింపచేశాయి' అన్నదానికి ఊర్మిమాల అంగీక రించితీరాల్సివచ్చింది. ఆమెలోయేర్పడిన స్వేచ్ఛామయమైన పడుచుచేష్టలు ముందు కుదుకుతుంటాయి. ఆమె పదిలే మృదోక్తులకి శంశాంకుడు గురియైపోతాడు. వీళ్ళిద్దరికొంటె పనులూ చూచి శర్మిలాదేవి చిరునవ్వు నవ్వింది.

హితోపదేశాన్ని ముగించుతూ నీరదుడు 'నిజమైన భావాన్ని ఉద్రేకింపచేయనిసంగతిని నీవు విడువరాదు. అక్క డికి నేను వెళ్ళుతున్నానంటే భయం నాకేమీ లేదు. కారణం నా సహజబుద్ధి నాసహజధర్మాన్ని పూర్తిచేసింది. నారక్షణలో నీవు వున్నంతకాలం నాపనులలో దేనిచేతనూ నీవు భ్రష్టురాలివి కావు' అన్నాడు.

'మీ రిప్పుడు చెప్పినమాటలన్నిటినీ నామనసులో పెట్టు కొని ఎప్పటికీ మరిచిపోను' అన్నది ఊర్మిమాల.

'నిన్ను గురించి కొన్ని గ్రంథాలువదిలివేసి వెళ్లుతున్నాను' వాటిలో వేరుగా గుర్తులుపెట్టినభాగాలను పఠించుతూవుండు. వాటిల్లో నీవు యెంతో ఉపయోగాన్ని పొందగలుగుతావు' అని నీరదబాబు అన్నాడు.

ఇటువంటిప్రబోధా లామె కావశ్యమయినవి. ఆరంభ శూరత్వంలో యెందు కీ వైద్యంచేస్తా నని అన్నానా అనే నిర సనభావ మీామధ్య యేర్పడి వేధించసాగింది. ఇప్పుడు తా నీ వృత్తికి పనికిరానిదాన నేమో ననే తాను సందేహించింది ఏటిని యీ దేవాడు మునిగిపోకుండా నడుముకుకట్టుకునే యీత కాయమాదిరిగా ఉశ్మిమాలాదేవిని యీపుస్తకాలు కాపాడాలి అన్నమాట.

వెళ్ళిపోయాడు నీరదబాబు. ఊర్మిమాల యిప్పుడింకా కఠినమయినశాసనాలను తనమీాద నెలకొల్పుకొంది కాలేజికి విధిగా వెళ్ళుతుంది. తక్కినకాలంలో ఘోషాస్త్రీమాదిరి తలుపులుమూసినయింట్లోనే కూర్చుండేది. కాలేజీనుండి సాయంత్రం యింటికిరాగానే అధ్యయనాలమీాద తనబుద్ధిని బంధించివేసేది. ఇలాగా తా నెంత శ్రమచేసినా అభివృద్ధికి రాలేకపోయింది. స్థిరత్వంచెందని ఆమెఆత్మ ఒకకాగితంమీాదనే పారాడుతోంది. అయినా తాను అపజయంపొందాను అనటాని కొప్పుకోదు. అందుకు దగ్గరలేకపోయినా దూరాన నున్న నీరదబాబు సంకల్పంయొక్క ప్రభావం యింతవరకూపనిచేస్తోంది.

జరిగిపోయినవాటిని తలంచుకొని ఆమెబాధపడుతూంది. ఆసమయంలో తనమీాదతనకే విరక్తికలిగింది. యువకు లెంత మందో ఆమెను శ్లాఘిస్తూంటారు. కొంతమందిని చూస్తే వెటకారంగా వుండేది. కొంతమందిని ఆమె ఆకర్షించేది. కాని, ఆఆకర్షణ యే యువకునిమీాదనూ ప్రణయస్వరూపం దాల్చలేదు. ప్రేమభావంమటుకు వసంతఋతువులోని కమ్మతావుల

వలె ఆమెమనస్సు నావరించింది. ఆకారణంగా ఆమె మధుర రాగాలాపన చేస్తూంటుంది.

తనవూహాకు వచ్చిన గేయపదాలను తనపుస్తకంలో వ్రాస్తూవుంది. తరచు సితారా వాయిస్తూ వుంటుంది. ఆమె హృదయం తీవ్రంగా కలతలపాలయినపు డిలా చేస్తూంటుంది. కళ్ళముందుంచుకున్న కాగితాలలో యెవరిముఖమో ప్రత్యక్ష మయ్యేది. అంతటితో ఉలిక్కిపడేది. ఆముఖం ప్రతిరోజూ ఆమె మనస్సుకు వచ్చి వేధిస్తూవుంది. ఎన్నోసాయంత్రాలటువంటి యాతనలతో గడిచిపోయినవి. ఇది సామాన్య మనుకోండి. గట్టిగా పాతిన స్థంభంలాగున ఆముఖం కనుపిస్తే; దానిలో తొందరించే ఉద్రేకత చూచి ఆమె మనసులో రోషంపెరిగి పోతూవుంది. సీతాకోకచిలుక వ్రాలి, మృదువైనకాళ్ళతో పుష్పాడిని ముద్రించినట్లు ఆమెమనసులో ముద్రలు అంటి పోయాయి.

ఈ ఉద్దేశ్యాలను ఆమె యెంతపట్టుదలగా విసిరిపారవే స్తుందో అవి యింకా అంతతీవ్రంగావచ్చి ఆమెహృదయాన్ని నాటుకుంటున్నాయి. ఆపీడను నివృత్తిచేసుకుంటానికి, హృదయా నికి స్థిరత్వమివ్వటానికి, నీరదబాబుగారిఫోటో తనటేబులుమీద పెట్టి, దృష్టిత్రిప్పకుండా చూడసాగింది. ఆప్రియాననంలో కళ వున్నది. మనసును రంజించే శక్తి లేదు. ఆతనిముఖం ఆమె ముఖాని కే సలహా యివ్వలేకపోయింది; తనమనస్సులో చోర బడలేకపోయింది. ఇప్పు డేం చెయ్యాలి? అతను పిలిస్తే తన ఆత్మ ఎందుకు మారుపలకాలి? వాని సామాన్యముకాని శక్తి

సామర్థ్యాలకు, న్యాయమయిన పోరాటాలకొరకు, ప్రయత్నాల కొరకు ఊహించరాని అదృష్టాన్ని ఆశించి అతనిని ధ్యానించటమే ఆమెపని. అంతకంటె ఆమెకు గతిలేదు.

నీరదబాబు లోకవిధంగా గెలిచా డనే చెప్పవచ్చు. ఊర్మిమాలా-నీరదబాబులకు వివాహం స్థిరంచేసినందుకుగాను శశాంకుడు మొదలైనఅనుయాయస్థులు నవ్వారు. రాజారాంగారు నాయకులై నీరదబాబు లోకఆదర్శనీయు డనుకున్నా డని యెగతాళిచేశారు. 'ఆదర్శనీయుడు. ఆదర్శ మనే పునుగు ఊర్మిమాల హృదయ మనే ఉక్కుపెట్టెకే రంధ్రంవేస్తూంది. ఇదే నిజం! ఎవరూ దీనిని దాచలేరు. ఆత్మార్పణం నీరదబాబు చేస్తా డన్నదికూడ నిజమే. అయితే ఆ ఆత్మార్పణం ఊర్మిమాలకు కాదు; ఆమెపేరున యింపీరియల్ బాంకిలోని రూపాయలకు. మనరకంనిజంగా డబ్బుకావాలని మనమామగార్లను స్వయంగా అడుగుతాం. ఇత నలా కాదు. ఈమహాత్ముడు పెళ్ళిచేసుకొనటం మహాత్కార్యాని కట! ఆ కాస్తఅధికారంవచ్చిన తరువాత మామగారిపేరున నున్న చెక్కులమీద అంకెలు పుట్టించటమేనేమో ఆమహాత్కార్యం' అని హేళనచేశారు.

ఈదుమారం ఆపటానికి వీలుకాని దని నీరదబాబు గమనించాడు. స్త్రీధనం కానీకూడా ముట్టననీ, స్వార్జితంతో జీవిస్తాననీ, వివాహానికిది శాసనంగా పెట్టాడు. తాను గడించుకొని యిగ్లాండుపోయి చదివిరావటం ఆలస్యమవుతుం దని తెలుసు. కాబోయే తనమామగారు తనకర్చులతో చదివిస్తానన్నప్పటికీ నీరదబాబుగా రంగీకరించలేదు.

ఇంకా రాంబాబుతో 'ఆసుపత్రిని నెలకొల్పటానికి మీరిచ్చే విరాళం బ్యాంకిలో మీ కూతురు పేర వెయ్యండి. నాకే ప్రతిఫలం లేకుండానే చికిత్సాలయం సాగించటానికి నేను పూనుకుంటాను. వైద్యుణ్ణి కాబట్టి నాజీవితాన్ని నడపటానికి భయపడ' నన్నాడు.

అంత సాటిలేని త్యాగం రాజా రాంబాబుకు నీరదబాబు మీద యింత సుచుకారం గలిగించింది. ఊర్మిమాలకుగూడ యింతఅహంభావాన్ని ఉదయింపజేసింది. అంతేగాక, ఊర్మిమాలయొక్క గర్వంవల్ల నీరదబాబుమీద శర్మిలాదేవితత్వ విరుద్ధంగా పరిణమించటానికి కారణమయింది. అందుకే ఆమె 'ఓహో! ఈతీవ్రం యెన్నాళ్ళుంటుందో చూడమూ?' అన్నది.

నీరదబాబు యెప్పుడైనా తనధోరణిలో గంభీరంగా మాటలుసాగిస్తే శర్మిలాదేవి చివాలునలేచి అక్కడ ఉండకుండా పోతుంది. పోతూ, సాళనచేస్తూ, తలవాంచుకొని, పెద్దచప్పుడవ్వేట్లు అడుగులు వేసుకుంటూ పోయేది ఐతే, చెల్లెలేమయినా అనుకుంటుందేమోనని శర్మిలాదేవి మాటాడేదిమాత్రం కాదు. అందుకే మాటాడకుండా ద్వంద్వార్థంచూపుతూండేది.

నీరదబాబు యూరపునుండి మొదట్లో వ్రాసేఉత్తరాలు నాలుగైదు కాగితాలు నండించేవాడు ఊర్మికిచ్చేసలహాలే ఆవుత్తరాలలో వుంటాయి. కొంతకాలం జరిగింది. తరువాత ఒక చిత్రమైన టెలిగ్రాం దూకింది. అందులో తన 'చదువుకు పెద్ద మొత్తంగా డబ్బుకావాలి. అత్యవసరంగా పంపించు'మని నీరద బాబుపేర వ్రాసివుంది. దానితో ఊర్మిమాల మనసులో

యింతదనుకా పాలబూ, నేతితో పెరిగిన గర్వానికి తేలికదెబ్బతగి లింది. టెలిగ్రాంవల్ల నిరాశామైన ఉపశాంతి కలిగింది క్రమం గా నీరదుడు తిరిగిరావటానికి పాయిదాలువడుతున్నాయి. ఆస మయం వెనుకకుపోతూపుంటే ఊర్మిమాల యింతకుముందు తాను తనప్రకృతిచుట్టూ కట్టుకొన్న విధి యను కంచుకోట నుండి పారిపోవటానికి యత్నిస్తూంది. తన్ను తానే వంచించు కొనే సాకులన్నీ చెప్పుకొనేది. దుఃఖంలో మునిగిన ఊర్మి మాలమనస్సుకి నీరదబాబు డబ్బుకోసంచేసినవిజ్ఞప్తి కాస్త వూరట గలిగించింది.

ఎస్టేటుమానేజరుచేతికి టెలిగ్రాంయిస్తూ వెనుకాముం దాడింది ఆమె—'డబ్బు - కాకాబాబూ!' అంది.

ఆ ఎస్టేటుమానేజరు 'దీనిభావం నా కర్థంకాలేదు. నీడబ్బుతో ఆయనకు పనిలే దనుకొన్నాం' అన్నాడు. నీరద బాబుమీాద అతనికి భేదభావం కలిగింది.

'అవు ననుకో. పరదేశాలలో–'అని తడబడేమాటలను పూర్తిచేయులేకపోయింది ఆమె.

'పరదేశవాతావరణం స్వదేశీయులను త్రిప్పేస్తుంది– నాకు తెలుసు. అయితే, వాళ్ళతో దూకగలమా?' అన్నాడు కాకాబాబు.

'మరి,పంపించకపోతే చిక్కుపడతా' రన్నదిఊర్మిమాల.

'సరే! పంపిస్తాను కాని, గాభరాపడకు. అయితే ఇది మొదలనీ. తుది కాదనీ జ్ఞాపకముంచుకో' అన్నా డాయన.

'దీనితో ఆఖ రనుకోవ'ద్దన్నమాట నిజమయింది—మళ్ళీ పెద్దమొత్తంగాడబ్బు మనియార్డరుచెయ్యమని నీరదబాబు టెలి

గ్రాం పంపాడు. మొదట చదువు కారణమైతే, యీసారి అనారోగ్యం కారణ మయింది- అంతే తేడా.

గంభీరంగా కాకాబాబు 'మీ ఆయనగార్ని సలహాఅడ గటం మంచిది' అన్నాడు.

ఊర్మిమాల యెంతో గాభరాపడ్డది 'అక్కా-బావల కీ విషయం చెప్పవ'ద్దని మానేజరును బ్రతిమాలుకుంది.

'మరి, యీపెత్తనం నాకు అంటగట్టవ'ద్దన్నా డాయన.

'ఎప్పటికైనా ఈజబ్బు కతనే అధిపతిగా?' అన్నది.

'ఆమాట నిజమే. అయినా, అంతకుముందు అర్థరహి తంగా యెవరూ ఖర్చుపెట్టరు' అన్నాడు కాకాబాబు.

'అందుకని జబ్బుచేసినపుడు చూడకుండానా-?' అని అడిగింది ఊర్మిమాలాదేవి.

'ఆజబ్బేమిటో మనకు తెలియదు. ఆయనగారు తిరిగి వస్తే విచారించి సరియైనవైద్యంచేయించవచ్చునుగదూ! ఆఏర్పా టులు నిర్విచారంగా చేద్దాం' అన్నాడు.

ఆమాటతో ఊర్మి కలవరపడ్డది. తనచదువే యింతకూ మూల మనుకుంది.

'సరే, యీపర్యాయంకూడా పంపించుదాం. దీనితో డాక్టరుగారిజబ్బు నయంకా దనుకుంటా' నన్నా డా మానేజరు.

రాధాగోవిందు ఊర్మిమాలకు ఎస్టేటుమానేజరే కాదు; సమీపబంధువుకూడ. ఆయనగారిరెండర్థాలమాటలతో ఆమెకు సందేహం జనించింది. 'అయితే, అక్కయ్యకి చెప్పనా?' అను

కున్నది. 'ఇంకా నా కతనిమీద విముఖత్వంకలగదేమా' అన్న ప్రశ్న మళ్ళీ మనసులో మెరిసింది.

భవానీపురంలో శర్మిలాదేవికి జబ్బు హెచ్చయినట్లు యింతలోనే కబురువచ్చింది. మునుపు అన్నాయికివచ్చిన వ్యాధి కూడ యిలాంటిదే నన్నమాట గుర్తుకురావటంతో ఆమె గుండెలు దడదడలాడాయి. ఇతరబంధువులుకూడా అలాగే గాభరాపడుతున్నారు.

శర్మిలాదేవి – శరీరంలో జబ్బుఅనేదొంగ యేమూల దాగాడో గమనించటాని కెందరోడాక్టర్లు సిద్ధపడ్డారు. అలసట తోనే ఆమె మెల్లగా నవ్వి 'సి.ఐ.డీలను గ్రుడ్డివాళ్ళనుచేసి తిరిగేదోషి. అమాయకులను నానాతిప్పలూపెడతాడు' అంది.

శశాంకుడు 'వారు చేయవలసిన అన్వేషణావిధిని వారు చేస్తారు. చేయనివ్వు. ఇక మూడవతరగతివిధానాలు నాకు యెపుడూ పనికిరా' వన్నాడు.

అప్పటికి పెద్దకాంట్రాక్టులు రెండున్నాయి. శశాంకుని చేతిలో. గంగానదీగట్టునవుండే జూట్‌మిల్లునకు ఒకదానితో సంబంధమున్నది. మీర్‌పూర్‌జమీలవనంలోవుండే యింటి పని రెండోకంట్రాక్టు. టాలీగంజిలో యీభవన ముంది. జూట్ మిల్‌కు కావలసినపని పనివారికి గృహాలు నిర్మించటం. ఈపని మూడుమాసాలలోతయారుకావాలి. ఇటుతిరిగి పంపులభావులను కూడ కంట్రాక్టుచేశాడు. పనులు యెన్నోచోట్ల పూర్తిచె య్యాలి. ఇన్నిపనులమధ్య శర్మిలాదేవిజబ్బును విచారించలేక నలగడపడుతున్నాడు.

పెళ్ళయిననాటినుండీ జరిగినజీవితంలో యింతచీకాకు పెట్టేజబ్బు ఆదంపతులలో ఎప్పుడూ రాలేదు. ఈనాటి భార్య అనారోగ్యభారానికి అతను పసివానివలె భీతిపడ్డాడు. చేతిలో పనిని నిలుపుకొని పరుగున యింటికిచేరుకునేవాడు. 'ఇస్, అబ్బా' అంటూ ఆమెప్రక్కన కూలబడేవాడు. 'ఇవ్వాళ నీ కెలావుంది' అంటూ ఆమెశిరస్సు నాప్యాయంగా నిమురుతుండేవాడు.

'ఫరవాలేదు – మీరు దూరక చిరాకుపడకండి' అంటుందామె.

లేనిసంతోషాన్ని చూపి, నమ్మరానిదానికై శశాంకుడు మనసును శాంతింపచేసుకుంటంలో గొప్పకష్టం తొలగినట్లుగా తలుస్తున్నాడు.

'ఒకగొప్పకంట్రాక్టుపనిని ఢెంకనాలురాజాగారు ఇచ్చారు. దానిప్లానుగురించి మంత్రిగారితో మాటాడాలి. పోయి, డాక్టరుగారు వచ్చేలోపల తిరిగివస్తా'నని శశాంకుడు చెప్పాడు.

నిష్కారణంగా ' గాభరాచెంది పనిని నష్టపెట్టుకోకండి మీరు పోవాలని నాకూ తెలుసు. పనులు సవరించుకోనండి. నా కేం? ఇక్కడ నా కుపచారంచేసేవా ళ్లున్నారు. భయం లేదు' అన్నది శర్మిలాదేవి.

అసాధారమయినద్రవ్యవంతుడుకావటానికే శశాంకు డీ రాత్రింబగళ్లు ముట్టడిచేస్తున్నాడు. అతనిని పైకెత్తింది డబ్బు కాదు_ తననుకూడిన డబ్బు కాదు. ఆధనంయొక్క ఆధిక్యత వాని నలా తయారుచేసింది. కీర్తికాంతగూడ అతనిని పిలుస్తుంది. మగవానిచేతిలో కొరతనిచ్చేధనముంటే విసుక్కుంటాడు, అది సహజం! అయితే, ఆధనం విస్తారంగావుంటే దానిని చూ

యెంతమందో వచ్చిపడతారు, శ్లాఘించుకుంటూ. అయితే ఇతని ధనం తక్కినవారందరి కుపకరిస్తుందా? కాదు. దానిఘనత అలాంటిది- అంతే!

శర్మిలాదేవిసరసనకూర్చున్న శశాంకుడికి శరీరమే అక్కడుంది. బుద్ధి తాను సాధించ నెంచినవారికి వచ్చే అవాంతరాలను గురించి యోచించి, శంకిస్తూ వుంది. తన పెనిమిటిభయానికి అతనిదురాశ కారణం కాదనీ, పటుత్వమయిన పునాదులమీద విజయస్తంభాన్ని నిలపాలన్నకోరికే ప్రధానమనీ శర్మిలాదేవికి తెలుసు. అతని ఉన్నతే తన ఔన్నత్యమని ఆమె తలుస్తుంది. కాబట్టి పనిమీద నిరాదరణ చూపి తన కెదురుగా కూర్చుండుట ఆమెకు పనికిరాక అతనిని పనిలోకి తరుముకుంటుంది.

భర్తగారిపట్ల చేయవలసినపనులు సరిగా, ఆచరించలేక పోతున్నానన్నవిచారంగూడా ఆమెకు వుంది. మరి, జబ్బుపట్టి కుందాయె. నౌకరు లెలా చూస్తున్నారో ఆస్వామికే తెలుసు. కల్తీనెయ్యి వడ్డిస్తున్నారేమో? వేడినీళ్ళ సకాలంలో స్నానాని కందిస్తున్నారో లేదో? క్రొత్తప్రక్కగుడ్డలు వేస్తున్నారోలేదో? వంటింటికూరములు మురికయ్యాయో బాగున్నాయో? చాకలి బట్టలమీద శ్రద్ధచూపుతున్నారో లేదో?- అనే విచారాలన్నీ ఆమెమనసులో తిరుగుతుంటాయి. మంచంమీదనుండి లేచి తరచు సి. ఐ. డి. గ తిరిగి గమనిస్తుంటుంది. బడలికచేసి మళ్ళీ టెంపరేచరు హెచ్చుతుంటే డాక్టరు అయోమయంలో పడుతుంటాడు.

ఈ అవస్థలతో వేగలేక తుదకు చెల్లెలినిరమ్మని వార్తపంపింది శర్మిల- 'కాలేజీకిపోవటం కొన్నాళ్ళయినా నిలిపి,

యిక్కడకు రాకపోతే, నేను చావతీరిక లేకుండా వున్నా' నన్న మాట సత్యం' అని.

ఇంతదాకా వచ్చినవారు యీస్థితిలో కథంతా తెలుసుకొన్నట్లు తేలికగా నవ్వి 'జరుగబోయేకథ నా కర్థనుయిందిలే' అంటారు. నిజానికి కథ ముగింపుచేయటం అట్టే గొప్పసంగతి కాదు. అయే దేదో అవుతుంది. అంతకంటె అయే దేదీ లేదు. అదృష్టపు పేకాటలో శర్మిలాదేవికళ్ళకు కనపడకుండానే ఆమె చేతిలోని తురుపుముక్కలను యితరులు గ్రహిస్తున్నారు. ఇది తప్పనిసరిఅని అనుకోనేపనిలేదు.

ఊర్మిమాల తనసోదరికి ఉపచర్యచేసే అవకాశం దొరికినందున చాలాసంతోషించింది. తన అవసరముయినపనులతోపాటు, నీరదుడు విధించిచూపిన కార్యాలన్నిటినీ ఒకప్రక్కగా త్రోసివేయుక తప్పలేదు. అందుచేత అక్కగారిపిలుపున కామె వెంటనే అంగీకరించింది. అదికాక- తా నవలంబించేది వైద్యం - అంటే రోగికి సేవచేయటమేగదా! ఇపుడు చేయబూనిం దా వైద్యసంబంధమే - అని సిద్ధాంతీకరించుకుంది. ప్రతిరోజూ రోగిలో కలిగే మార్పులను గీసే గ్రాఫుపుస్తకాలు సేకరించుకుంది. ఒకవేళ అక్కడవుండే డాక్టరు తన కేమీ తెలియ దను కుంటాడేమోనని ప్రస్తుతం ఆమెవ్యాధిలక్షణాలు తెలిపే పుస్తకాలు పఠించటానికి ఖాయంచేసుకుంది.

ఆమెచదివే బి. యస్.సి. క్లాసునందు అభిమానమయినది శారీరకశాస్త్రం. కాబట్టి ఆవైద్యవిద్యలోని వాక్యాలన్నిటినీ తిరిగి అర్థంచేసుకోనటం ఆమెకు సులభమే. చిన్నమాట! తనసోదరికి సేవచేయటం తను చేయదగినపనిని పాడు

చేయటం కాదు; యీ అనుభవం ముందుముందు తన కెంతో సహాయ మవుతుందనికూడా మనసును ఒప్పించింది. ఆమెకు కావలసిన పుస్తకాల్లదస్తరంతో భవానీపురానికి పోయింది ఊర్మిమాల.

అయితే,ఆమె వైద్యగ్రంథపఠన అనుకొన్నంతగా సాగక పోవటానికికారణం–కొమ్ములుతిరిగినడాక్టరులే అక్కగారిజబ్బును పేరెత్తి చెప్పలేకపోయారు. ఊర్మి అది యేవ్యాధి అని పుస్త కాలను, పరిశీలిస్తుంది, మరి!

రోగివుండేగదికిసంబంధించినపనులన్నీ చేయటం తన ప్రాచీలోనివే అని అనుకొని 'అక్కా! డాక్టరుసలహాలన్నీ ఆచరణలో పెట్టటానికే నేను వచ్చిం దిక్కడికి. నేనుచెప్పినట్లు నీవు వినాలి' అన్నది ఊర్మి.

ఊర్మిమాలచూపిన గొప్పలతన్యానికి శర్మిలాదేవినవ్వింది. చెల్లాయిని చూచి 'ఎవరే,నీ కీచదువు నేర్పింది? కొత్తగా మతం తీసుకొన్నవాడిపిచ్చిలాగా అతి చేస్తున్నావు. నిజానికి నేను నిన్ను రమ్మన్న దెందుకో తెలుసా? నేనుచెప్పే అభిప్రాయా లను ఆచరణలోపెట్టించటాని కెవరైనా కావాలి. నీఆసుపత్రి పూర్తికాలే దింకా. నాయింట్లో ఉద్రేకాలు వచ్చిపడ్డాయి. ఇంతలో నాకు కాస్త స్థాయియిచ్చి, యింటిపని చూడు' అంది శర్మిలాదేవి.

వైద్యంచేయాలనుకొనివచ్చిన ఊర్మిమాల అక్కగా రింట్లో పెత్తనంచేయట మయింది. ఇంటిపనులన్నీ గొడవలుగా వున్నాయి. తత్‌క్షణం ఆమె యెంతో తగుచర్య తీసుకోవాలి.

ఈయింట్లో చేయవలసింది యేమిటంటే - అతిప్రాముఖ్యంగా గృహాధికారిగారికి ఎటువంటిలోపంలేని సౌకర్యాల నమరించటం.

భర్త తనపనులు తాను చేసికోలేడని శర్మిలాదేవినమ్మకం. అది మామూలేది కాదు. శశాంకుడు చుట్టకాలుస్తున్నా డనుకోండి. రవ్వపడి చొక్కా కాలుతుంటే శర్మిలాదేవిచూచి, చొక్కాను నలిపి నిప్పునార్పుతున్నా ఆయనమనసు ఈప్రపంచలో వుండదు. ఆవింతచర్యను చూచి శర్మిలాదేవి నవ్వటానికిబదులు విచార పడుతుంది- 'అయ్యో! ఇంతఅమాయకు డేమా!'అని.

సాన్నంచేసినవాడు కుళాయి కట్టివేయకుండానే బట్టలుమార్చుకొని తొందరగా బజారుకు వెళ్లిపోతాడు. కుళాయి అప్పుడు పడకటిగామునంతా నీళ్ళతోనింపుతుంది. నేలమీాద వుండేవస్తువులన్నీ తడిముద్దలైపోతుంటాయి. అసలు ఇంట్లో పంపువేసేటప్పుడు యిలాంటిమందమతిపనులు జరుగుతుంటాయి అనే శర్మిలాదేవి దూరంగా వెయ్యమని సతపోరింది. శశాంకుడు వింటేగదా! మరి, ఇంజనీరుగారు వారిశాస్త్రీయమంటూ విన కుండా నీటికుళాయిని పడకటింటిప్రక్కనే వేయించాడు. ఇంకా యాతనలుపెట్టే పరికరా లెన్నో చెత్తచెత్తగా తెప్పిం చాడు.

ఆనుహాశయుడు తా నోక్రొత్తనమూనాను తన తెలివితో తయారుచేశాడు. చల్లదనం రాకుండా నమూనాచుట్టూ పనెట్నూ, మర్బిగ్గా అమరించాడు బూడిదను వెంటవెంటనే బయటకులాగే సదుపాయాలు దాని కున్నాయి. పదార్థాలను వేడిచేయటం, వుడికించటం మొదలుగాగలఅన్నిరకాలఏర్పాటు

లందులోనే యిమిడించాడు. గృహోపయోగకరమైన వంట సౌకర్యాలకై తాను చేసిన యీనూతనసృష్టిమీద మంచి మంచి అభిప్రాయాలే వచ్చాయి. కాని, నిజానికి దానియుపయోగం వా రనుభవించింది ఏమీ లేదు. పెరిగినపిల్లలకు యెంతోయిష్టమైన హాబీలు వుంటాయి. కొందరు తమలోనే వాటిని మరచిపోతారు. వాటిని తిరస్కరించి తేవైరానికి మూల కారణమవుతుంది. నిత్యమూ జరిగే దానిఫలితంగావిసుగుచెంది, మరొకసందర్భంలోకి పరుగెత్తుతారు. ఆడవారు పైపై మెప్పులే చేయగలుగుతారు. పిదప వారిమనసు ననుసరించి వర్తించటం వారిస్వతంత్రంలో వుంటుంది. ఇలాగా భర్తనుపాలించే అధికారాన్ని శర్మిలాదేవి చిరకాలంనుండీ అనుభవిస్తోంది.

నిజానికి ఆమె యీఅధికారం చలాయిస్తూ, శశాంకుడికి తా నుంటేనే ప్రపంచం అనుకుంటుంది. అయితే, ప్రపంచం నుండి తన్ను దూరంచేయడానికి యమభటుడు పొంచియున్నాడేమోనని సందేహించింది. తనమరణాన్ని గూర్చి తనకు దిగులు లేదు. తానుపోయినాక తనభర్తకు సౌఖ్యంఅమరకపోతే తన ఆత్మ శాంతిపొందదని ఆమెఆందోళన. తనకు సంపూర్ణశక్తిలేక పోయినా మొత్తానికి బాధ్యత మోయటానికి ఊర్మిమాల వుండట మొక అదృష్టం. ఎలాగయినా స్త్రీకూర్పు స్త్రీకూర్పే గదా! ఆకూర్మిలేకపోయినపుడు మగవాడుపొందే విహారాదుల కవసరమైన పెంపు, సొంపు, మాధుర్యం వుండవు. నిస్సారమైన యెడారిమాది తోతుంది. చెల్లెలు పనులన్నీ నవరిస్తూంటే అక్క చూచి సంతోషించేది.

'అమ్మాయీ! మీ బావగారు అశ్రద్ధగలవారు. కొంచెం గమనించి ఉండు, తల్లీ!'

నిజంగా పుస్తకాలుచదివేటంతఅలవాటు ఊర్మిమాలకు యింటిపనుల్లో లేదు. లేకపోయినా, ఆమెకు నూతనంగా లభించిన తనపనులు పూర్తిచేయటంలో అసాధారణసుముఖత్వాన్ని చూపుతుంది. నేటివరకూ తాను అనుభవించిన కాఠిన్యనిబంధనలతోగూడిన జీవితాన్ని పారద్రోలింది. కాబట్టి ఆపనులుకాకుండా యేయితరకార్యాలయినా ఆమె కుత్సాహం చేకూర్చసాగాయి. సరళంగా ప్రవహించే ఈసంసారవాహిని శ్రద్ధాభిమానాలు, తొందరలనే మహాసాగరంలో ఉన్నటులు గ్రహించింది. తనఅక్కగా రద్దానిని నడుపుతూవుందనికూడా తెలుసుకుంది.

ఊర్మిమాల కిది విలాసంగా, విశ్రాంతిగా, విపులీకరణ వృత్తిగా కనుపించింది. పురాతనమైన తనప్రపంచానికి యీ ప్రపంచానికీ పూర్తిభేదం కనుపించింది. ఈలోకానికి ఒకపాఠమనీ, ఒకస్థానమనీ వుండేదేదీ లేదు. తాను నిర్వర్తించవలసిన దంతకంటెనూ లేదు. అలాలేకపోయినా యేదోఒకపని కాళీ లేకుండా పగలంతా చేస్తుంది. అదైనా విసుగుపుట్టదు. అనేక విధాలుగా మనసు నానందపెట్టుతుంది. ఒకప్పుడు పొరపాటు జరుగవచ్చునుకాని దానికి తానే సమాధానం చెప్పవలసిన నిర్బంధంలేదు. శర్మిలాదేవి లఘువుగా మందలించబోయినా శశాంకుడు వెనుకేసుకొని వచ్చి 'పోనిద్దూ, ఇంతలో

ముంచుకపోయిం దేముంది? అదీ ఒకందుకు మంచిదే' అని నవ్వేతాడు.

ఆచిన్నలోకంలో యేకాగ్రచిత్త మనే బాధనుండి ఆమె తొలగిపోయింది. నిజమైన మాట – 'క్రొత్తగా తయారయిన యీవిశ్రాంతివాతావరణంలో ప్రమాదాలు వరాకులు చూచి, విచారించేవారు లేరా?' అని అనుకునేది. శశాంకుడుకూడా యీఊర్మిమాలపనులకు ఒకవిధమైనవినోదాన్ని పొంది, విశ్రాంతి తీసుకుంటున్నాడు. జీవితమంటే యిప్పు డొక వనభోజనంగా మారింది. ఊర్మిమాలలో యెటువంటిజంకూ లేదు. ముఖకవళికలలో మార్పు లేదు. పొరపాట్లుజరిగినపుడు సిగ్గుపడటం అంత కంటె లేదు. ఎప్పుడూ కులాసాగా కేరింతలుకొడ్తూవుండటమే. వాటివలన ఆమెపనులన్నీ చూచి శశాంకుడు తనమనసులో పీడించే కార్యభారాన్ని తగ్గించుకుంటున్నాడు. చేతిలోపని పూర్తిచేసిగాని, పూర్తికాకుండా నిలిపిగాని తొందరగా యింటికి రావాలనేతాపత్రయం అతనిలో కలిగిం దిటీవలనే.

ఇంటిపనులను సవరించుకొనటంలో ఊర్మి తరిఫీతుపొంద లేదనే చెప్పాలి. ఆమె పనిపాటలతో కాదనుకోండి–తనయొక్క అందచందాలతో, యితరప్రవర్తనలతో కళాహీనమైన ఆ యింటికి కళలు వెలిగించింది. ఆయింటిలో నిండియున్న నిర్జీవత్వ మేమిటో చెప్పమంటే సులభంగా చెప్పలేము.

శశాంకుడు యింటికివస్తూనే మహోల్లాసకరమైన సుందర వాతావరణాన్ని చూచేవాడు. ఆఆనందం సంసారబంధమైన దేమీగా కాదు. కేవలం ప్రకృతివాతావరణంలోదీ కాదు. దాని

కంకోకఆనందరూపం వుంది. యథార్థంగా జీవంలేని ఆకుటుంబా నికి ఊర్మి జీవాన్ని ప్రసాదించింది. ఆమెఆనందమయతత్వానే రాత్రింబగళ్ళూ యీకళను కూర్చుతుంది. కళ్ళుభ్రమించేలాగా ఎంతోసేపుపనిచేసి విసిగినవానిర క్తనాళాలతోసహా గగుర్పాటు చెందిస్తుంది. పొరపాటులేనిమనసుతో తాను శశాంకునికి మనో ల్లాసాన్నికలిగిస్తున్నా ననే భావం ఊర్మికి వుంది. దానికికారణం- ఇంతకుముందు తనముందున్నవాళ్లు సంతృప్తిపడుతున్నా రనే నమ్మిక ఆమెకు లేదు. అందుచేత, ఆమె యెంతో చిన్నపోయి అవమానంచెందినట్లు తలచుకొనేది.

అవసరమైనవాటిని ప్రాణపదంగా సేకరించుకొనేవా డా గృహాధికారి అయితే ఆపని యిప్పు డాయన ప్రధానంగా యెంచటంలేదు. శశాంకునిమనసు యిప్పుడు ఆనందంతో తన్మ యమైపోతూ వుంది. అందుచేత అత డా ఆనందంలో మునిగి తేలుతున్నాడు.

'చిన్నవిషయాల కింత చికాకుపడాలా? మామూలాచా రం యెప్పుడయినా మార్పుగాంచితే అందువల్ల నష్ట మేముంది? ఇంకా హృదయానికి స్థాయి కలుగుతుందికూడా?' అని శశాంకు డన్నాడు తనభార్యతో.

ఆటుపోటులు తినే నదిలాగా నడుస్తోం దిపుడు శశాం కునిహృదయం. ఇంతకుముందు పనిభంగమనీ, అధికనష్టమనీ యేవేవో దూకుడుగా అనేవాడు. ఈరోజు ఆయనలో ఆ ఆదుర్దా అనుకోటానికిగూడా కనపడటంలేదు. అటువంటి నల్లమబ్బేదయినా ఆకాశంలో క్రమ్మితే ఊర్మిమాలనవ్వు

లతో దూరంగాపోయేది. శశాంకు డేదో గొప్ప ఆలోచనలో పడినట్లు తెలిస్తే, ఊర్మి వెంటనే '– మళ్ళీ మీ ఊరునుంచి బండీ వచ్చిందా యేం?– అతనే!– ఆపచ్చరంగుతలగుడ్డచుడతాడే – ఆ పెద్దమనిషి– యివ్వాళ వచ్చాడా?– ఆ దళారీ బేరగా డండీ!– ఎటునుంచో వూడిపడి మిమ్మల్ని దడిపిస్తున్నాడా?' అని అడుగు తూంది.

'అతనిని నీ వెలా గుర్తించావు?' అని అడిగాడు శశాంకు డాశ్చర్యాన్ని సూచిస్తూ.

'తెలియకపోవట మేం? బాగా తెలుసు. ఆరోజు మీరు వీధిలోనికి పోయినప్పుడు బికనీరునుండి వచ్చినాయన పొంచుక కూర్చున్నాడుగదూ! అపుడు మాటాడాను. బికనీరునివాసే అయితే, దోమతెరకు అగ్గితగిలిమండటంలో భార్యచనిపోయిం దటగా! మళ్లీ పెళ్ళాడటానికి పిల్లను వెతుకుతున్నా' డన్నది.

'మీ యిద్దరికీ మధ్య అంతవరకూ ఆలోచనవచ్చివుంటే– నే నింటిలో లేనపుడల్లా వాడిక్కడికి హాజరవుతాడు. కాబోయే భార్య యెవరో ఆయన కింకా తెలియలేదు. అంతవరకూ వాడి కి కలలు వస్తూనేవుంటాయి' అని శశాంకు డన్నాడు.

'మీ కాయనవల్ల యేంకావాలో నాకు చెప్పండి. నే నాయనచేత చేయించగలుగుతా ననుకుంటా' నన్నది.

ఈమధ్య కొద్దిరోజులనుండీ శశాంకుడిఆదాయం తగ్గింది. ఆయన యేమీ చికాకుపడకుండా రేడియో ప్రసారాలు వినటం, నాటకాలు చూడటం అధికంచేశాడు. అతన్ని రేడియోదగ్గరకు రమ్మని ఊర్మి గుంజితే 'నాకు తొందరప నుంది' అనటం మారి

పోయింది. విమానాశ్రయానికి హాజరై యెగిరే విమానాలను చూచాడు – విమానప్రయంత్రపరిశోధన కాయన వెళ్ళాడను కొంటారేమో – ఒక వేళ, కాదు.

ఇదివరలో శర్మిలాదేవే బజారువెళ్ళి కూరలు, మాంసము, చేపలు క్రయంచేసుకొనివచ్చే భారం వహించేది. ఎప్పుడయినా యీపనిలో శశాంకునిసహాయం కోరవలసివస్తుందనీ, లేక ఆయనగారే స్వయంగా రావటంజరుగుతుందనీ కలలో గూడా వూహించింది కాదు. అటువంటిదానికి శశాంకుడు యిపుడు తయారై మార్కెటుకుపోవటం నేర్చుకున్నాడు.

ఊర్మి తాను కొనే దేదీలేకపోయినా బావవెంట బజారుకు వెళ్తుంది. ఏదో తనుచూడనెంచినవస్తువును త్రిప్పిచూస్తూ బేరంఆడుతుంది. ఆమె కివ్వాలని శశాంకు డేదయినా కొనే యత్నంలోవుంటే ఊర్మిమాల గభాలున ఫర్సులాగి తన బ్యాగ్‌లో వేస్తూంటుంది.

శశాంకుడు చేయవలసినపనిలోమాత్రం మరదలు భాగానికి రావటంలేదు. అయితే అతనికాలాన్ని అప్పుడప్పుడామె యెంతో వ్యర్థంచేస్తుండేది. ఆమెమీ దప్పుడు కోపం చూపేవాడు. దానిపర్యవసానం భీకరాకారం దాల్చేది. పనివిషయంలో రెట్టింపుచాకిరీచేస్తేనేగాని మాటదక్కేది గాదు. ఇటు చూస్తే ఊర్మిమాల కన్నీరుపెడుతుంది. అటుచూస్తే తొందర పనులుభయపెట్టుతూంటాయి. రెంటిమధ్యా అతనునలిగేవాడు. అందుకని యింటికివచ్చేముందే అవసరపుపనుల్ని ఆఫీసులో

మంటుంది. అతనుచెప్పే గణితాన్ని ఆమె బహుతేలికగా గ్రహిస్తూంటే యెంతో మెచ్చుకొనేవాడు. ఆతడిచ్చిన పెద్దపెద్ద లెక్కలను ఆమె సునాయాసంగా తయారుచేసి యిస్తోంది. జూట్ మిల్లులో తయారవుతూన్నపనిని శశాంకుడు పరిశీలించేయ టానికి బయలుదేరుతూవుంటే వెంటవస్తానని మొండికేస్తూం టుంది. అంటే వానితోగూడి పరాయిగ్రామాలకు పయనించ టంకాదుగాని — బావగారిగణితచంద్రికతోనూ, అభిప్రాయాల తోనూపోటీచేస్తుంది. ఆమెశక్తిసామర్థ్యాలకు అబ్బురపడ్డాడు. కమ్మగా శ్రావ్యంగా చదివే పాటలు వింటూ అతను అమితా నందంలో తేలియాడేవాడు.

శర్మిలాదేవికి మహాలావులజ్జగా వుండే, చెల్లెలుచేసే అల్లరిని సహిస్తుంది. గృహకృత్యాలలో ఊర్మిచేసేతప్పులెన్నిటి కయినా ఆమె ఓర్పుదాలుస్తుంది. అయితే, పెనిమిటిగారికార్య కలాపంలో ఊర్మి మితిమీరినగొడవపెట్టుతుంటే మండిపడు తుంది శర్మిలాదేవి. మగవానిసంగతిసందర్భాలలో జోక్యం తీసుకోటం స్త్రీలధర్మానికి విరుద్ధమనిఆమెవిశ్వాసం. ప్రపంచాని కనుకూలంగా, నిజధర్మానికి సంబంధంగా నడవటం ప్రతివారికీ విధి–ఆచరించవలసినదాన్ని నిదర్శనంగా తిరస్కరించనట్టే–నని శర్మిలాదేవిఅభిప్రాయం. మనసులో మథనపడుతూన్న యీ విషయాలను దాచలేక తానొకసారిలా మాటాడింది, ఊర్మి మాలతో—

'ఊర్మీ! ప్లానులుతయారుచేయటం, లెక్కలు దిద్దటం నీ కంతహాయిగా వుంటాయా, యేమే?'

'చాలా హాయిగా వున్నాయి?'

'నిజంగానా! లేకపోతే, బావగారిని మెప్పించటానికిలా శ్రమచేస్తున్నావా?' అని అక్కగా నడిగింది.

శశాంకునిఉల్లాసాన్ని శర్మిలాదేవి ఆపేక్షిస్తుందికదా! అని మన మనుకోవచ్చు. ఆమాట అబద్ధంకాదుగాని. అతనికి మామూలుసుఖాలను కలుగచేసి, అంటే — వేళపట్టున స్నానానికి ఉడుకునీళ్ళుతోడడం, ఆయన కిష్టమైన కూరలు ఫలహారాలుపెట్టడం. ఉతికినబట్ట లందించటం. అతనిగదిని సుభ్రపరచి సపర్యలుచేయటం ఆమె కోరుతుంది. కాని, ఆయనగారి పనిలో కలియబడి ఆయన్ని సుఖింపచేయుటగ ఆమెను చేతగాదు — యితరులుచేయటం పనికిరాదు.

శశాంకుడి కామె తరచు వార్త లంపిస్తూ వుంటుంది — 'ఊర్మితో మీరు మీ కాలాన్ని వ్యర్థపుచ్చుతా రెందుకు? అది పసిసన్యాసి; మీ లెక్కలు దానికి తెలుస్తాయా? మీపని కష్టమౌతుంది' అని.

'నీచెల్లెలు నాకంటే తక్కువయిందికా'దని చెప్పి ఆ పొగడ్తలతో అక్కగారిని సంతోషపెట్టమాచేవాడా శశాంకుడమాయికంగా.

శశాంకుడు కంట్రాక్టుచేయుట మారంభించినకాలంలో పనితొందరతో, తా నొక స్వతంత్రుడ నన్నట్టుగా భార్యను సరిగా చూడలేదు. ఆరోజులలో తనభర్త యిలా మారడం కష్టమనుకుంది. దానికితోడు గర్వంచూపిందికూడ: 'మహారాజుల జాతిలోవాడు మగవాడు. అతడు తనవీరధర్మరాజ్యాన్ని విస్తారం చేసుకోవాలి.తనకార్యనిర్వహణకు స్త్రీయొక్క ప్రేమమధురాలు సరిపోతాయి. మగవాడు అలాగా తనఆధిక్యతను నిరూపించు

ప్రాప్తి చేసుకుంటుంటాడు. అయితే, ప్రొద్దుపూర్తిగా వ్రాలినాక ఆఫీసులో కూర్చోలేకపోతున్నాడు

అత నెందువల్లనైనా ప్రొద్దుపోయి యింటికి చేరితే అతనికి ఊర్మిమాలలో రాత్రివంటి నిశ్శబ్దం కనుపిస్తుంది. ఆమె నేత్రాలలోతిరిగిననీళ్ళను నిలుపుకొంటానికిచేసేయత్నం చూచి ద్రవించిపోయేవాడు. ఊర్మి 'నన్ను స్వీకరించితే ఒట్టు' అని అంటే, శశాంకుడు 'నేను నీకోపాన్ని సహించాలికాబట్టి, మన్నిస్తాను. కొంపతీసి టెన్నీసు ఆడననికూడ ప్రతిజ్ఞచేయబోకు' అని ప్రాధేయపడేవాడు. మాటాడుతూనే టెన్నీసురాకెట్లు హాజరుపెట్టేవాడు. ఊర్మిని ఆటలోగెలిపించి సంతోషపెట్టటానికి తాను కావాలనిఓడిపోతాడు. మరునాడుప్రొద్దున 'నిన్న నేనెంత పొరపాటు చేశాను?' అని అనుకొంటుంటాడు.

ఏదో ఒకవిశ్రాంతిరోజున శశాంకుడు అతనిచిక్కుసమస్యనుగూర్చి భేదించుకుంటూ కూర్చుంటే మరదలువచ్చి 'మీ బ్రోకరువచ్చి నన్ను వెంటగొనిపోతాడట! పరేశనాథాలయానికి నీవు రా బావా!' అనేది.

'ఈరోజు తప్పనిసరైన పని వున్నది' అని అత ననేవాడు

పనివున్నదని చెప్పితే ఊర్మిమాలకు భయమా? ఆమె తిరిగి 'ఆ తలపాకాగానిచేతుల్లో దిక్కులేని ఒక యువాంగనను విడిచిపెట్టి, రక్షించాలనేమాట నలుసంతయినా అనుకోకుండా యెలా వుంటావు? ఇదేనా పురుషత్వం?' అంటుంది.

తుదిసారికి ఆమె నెదిరించలేక, కాపునడపటానికి లేచి, పనిని పాడుచేసుకునేవాడు.

ఆపిచ్చిపనులు వింటే శర్మిలాదేవి యెంతో బాధ పడు తుంది. ఆడ దలా మగవాడిపని కడ్డంపోవట మామె కే మాత్రమూ గిట్టదు. ఊర్మిమాలను పసిబిడ్డగా తలచే అక్క యీనాటికీ అదే తత్వంలో వుంది. అయినప్పటికినీ తనభర్తగారి గదిని యెప్పుడూ, యేపరిస్థితిలోనూ విలాసపుగదిగామార్చటం అంటే శర్మిలాదేవి సహాసంచూపదు. ఆకారణంగా చెల్లెల్ని పిలిచి బాగాచివాట్లుపెట్టింది. ఆతిట్లకు బదులుచెప్పేదే-కాని, ఆసమయంలో శశాంకుడు తలుపుచాటున నిలుచుని, మరదలికి చీట్లపేకగ్రంథాన్నిచూపి గదిలో పేకాడుకుంటానికి రమ్మని సైగతో పిలుస్తున్నాడు.

నిజంగా అవి పేకాటకు వేళకాదు. ఆ టాడాలనే కుతూ హాలంకూడా ఆయనకులేదు. ఊర్మిమాలమనసునొచ్చుకోకుండా పేకాటమీదకు త్రిప్పుదామని అతనితిప్పలు. ఆ నెపంగనక ఆపని చేయటానికి పూనుకుంటే అతను గట్టిగా మందలిస్తాడు. కాని తనభార్యే మరదలిని అలామందలించినపుడు తానోర్చుకోలేక వెనుకేసుకొనివచ్చేవాడు.

శర్మిలాదేవి భర్తకు 'మీరు దాని కంతచనవివ్వటం దేనికి? మీపని నష్టపడిపోదూ?' అని కబురంపింది.

'ఏదోలే చిన్నపిల్ల! స్నేహాని కెవరూ లేరాయె. ఆడుకో కుండా తా నీ కొంపలో ఒంటరిగా కాలంజరపొద్దూ?' అని జవాబిచ్చా డాయన.

ఆమె అల్లరిపనులలోన్నూ అంతే. అయితే ఒకమార్పు. శశాంకుడు కుర్చీలోకూచుని యేదో ప్లానుగీస్తూంటే — ఊర్మి మాల మరొకకుర్చీ వానిప్రక్కనచేర్చుకొని అదేమిటో చెప్ప

లో పడివుంది. లేచి కిటికీలోనుండి బైటకుచూస్తూ ఆ మెమన సులో-దానిస్థానం వేరు; నా స్థానం వేరు. ఒకరిస్థానం మరొకరికి రాదు. ఆయనగారికి నేను లేకపోతే కొంతకొరత; ఊర్మి లేక పోతే అంతాకొరవే అవుతుం'దని అనుకొంది.

చలికాలం సమీపంలోకి వస్తుందన్న ఆలోచనకూడా యీ యాలోచనతో కలిసివచ్చింది. కొన్నిబట్టలు యెండలో ఆరవెయ్యాలికదా! అనుకొని, బావతో టేబులు టెన్నీసులో మిళితమైవున్న ఊర్మికి శర్మిలాదేవి కబురంపింది:

'ఉన్నిగుడ్డలు వెలుపలికితీసి డాబామీద ఆరవెయ్యి. ఇవిగో తాళాలు.'

ఊర్మి తాళంచెవిని సరిగా త్రిప్పిందో లేదో, అడ్డు పడ్డాడు శశాంకుడు - 'చాలా ప్రొద్దుందిలే. ముందా ఆట పూర్తిచేశాక పోదువుగాని రా!' అన్నాడు.

'అక్కాయి—'

'మీ అక్కాయిగారిసెలవు తెప్పించియిస్తాలే.'

శర్మిలాదేవి దీర్ఘనిశ్వాసం విడిచింది చెల్లెలి కనుమతి యిచ్చేసి, దాసీదానితో మంచుగడ్డ లున్నసంచిని తనతలమీద పెట్టించుకున్నది.

తలవనితలంపుగా లభించిన స్వాతంత్ర్యంలో మైమరచింది ఊర్మిమాల ఆమెజీవితానికి గణ్యాంగా దలంచిన కష్టకార్యం హృదయంలో మెరుస్తూవుంది. తనకు హాయిలేదన్నమాట తెలు సుకున్నది. తానుచేసిన శపథానికి తాను బంధింపబడినట్లు, తనపై అతనికి అధికార్ర మున్నట్లుకూడ ఆమె తెలుసుకుంది. ఆపెత్తనంలోనుండి తా నెలాగా తప్పించుకోలేనని అనుకుంది.

ఆహారాన్ని గుర్తించటం - నీరదుడు తనముందున్నంత కాలం ఆ అధికారాన్ని నిర్వర్తించటం - మొత్తో సుఖంగా వుండి కష్ట మనిపించలేదు.\

నీరదుడు తనముందున్నంతసేపూ అదొక దివ్యజ్యోతి. ఆ దివ్యజ్యోతిలోని సూక్ష్మజ్యోతి తనలో లీనమయింది. ఆ హృదయమే యిప్పుడు దూరమయింది. అందుచేత మారిపోయింది. చెడుదారి పట్టింది. చైతన్యమేదో తన్ను నొక్కి చెప్తూంది. అందునా మన సెంతో తెనుగుబాటుచూపింది తన మార్గము తాను తప్పుట క్షమించరానిది. అయితే యిదే దూరంచేసింది. ఆమెలో వ్యధపెట్టే తెంపులేని మనోబాధమీద మత్తుచల్లటానికే భావంతో హాస్యాలాడ పూనింది. 'చివరకంతా బాగుపడుతుందిలే! లభించిన ఈవిశ్రాంతిని హాయిగా అనుభవిద్దా'మనుకుంది

అనుకోకుండా నుదునాడు తలనూచి మనస్సుచిక్కబట్టుకునేది. పుస్తకాలను దీక్షతో చదివేది. అయితే యేం? ఆమె పుస్తకాన్ని చదివేకాలంలో శశాంకుడు చేసేపనిచేసి తీరేవాడు. అంటే - దానిని భంగపరచటం అన్నమాట! చేతిలో బొమ్మ గుంజుకొని పెట్టెలోదాచి ఆపెట్టెమీద యోగదీక్ష పూనేవాడు.

'శశాంకదాదా! మీరుచేసేది అక్రమం నాపనిని పాడుచేయకు' అని అనేది ఊర్మి.

'నీకాలంతోబాటు నాకాలంగూడా వృధాఅవుతుంది కాబట్టి, దానికి దీనికీ చెల్లు' అని శశాంకు డనేవాడు.

కోనేదీక్షను బూనాలి. లేకపోతే, మగవాడు ఆడదానిముందు తేలికవుతాడు. పూర్వంల రాజులు దేశాలుగెలవటానికిపోయా రంటే కేవలం దురాశతో కాదు; తమశౌర్యంచాటటానికే. ఆ ఆశయానికి స్త్రీ దూరంగా వుండాలి' అని పవిత్రమైన తన మనస్సును సమాధానపరచుకొని ప్రశాంతిచెందింది శర్మిల.

అలా శర్మిలాదేవి భర్తనెదిరించకుండా తొలగివుంది. శ్రద్ధాభిమానాలతో గట్టిగా భర్త నొకసారి కట్టివేసింది. ఈనా డలా కాదు. చేజేతులా ఆ త్రాళ్ళను త్రెంపివేసింది. ఆయన ముందుపోతుంటే వెనుకనిల్చి సేవిస్తుంది. ఈపని ఆమెలోని త్యాగంకాని, మోదంకాదు.

ఇపు డా శశాంకు డంటారా? తనపనిలోనుండి రోజు రోజుకూ భ్రష్టుడై పోతున్నాడు. ఆస్థితి కళ్ళారా చూడాల్సి వస్తోంది. లేచి నడువలేదు శర్మిల. అయినా యింట్లోజరిగేవన్నీ తాను చూడలేకపోయినా మొత్తంమీద సంగతులెలాగో తెలు సుకుంటూనే వుంది. భర్తగారిముఖంలో శర్మిలాదేవికి యెల్ల ప్పుడూ పారవశ్యత ప్రతిఫలించి మైమరపు చెందించు తూంది. ఈ చెల్లివచ్చి నీతిమంతుని నిర్మూలనంచేసింది. ఆమెకు వ్యాధిబాధకంటే అపనిందనుగూర్చిన బాధ యెక్కు వయింది.

కొన్నిఆనందాలకు సౌఖ్యాలకు శశాంకుడు అలవా టయ్యాడు. వాటి కిపుడు హాస్తోదకాలు ఒదలవలసివచ్చింది నిస్సందేహంగా. మాటవరస కనుకుందాం. ఇదివరలో ప్రతి దినం తన కిష్టమైనకూర విస్తరిలో వుండేది. ఇప్పు డలా కను పించుటలేదు. ఏదో వినవడ్డకారణంతో 'సరే' నంటున్నాడు.

మును పీ పని జరిగిందో పెటీపెటీ చివాట్లుపెట్టేవాడు. అంత శిష్టమైనయింట్లో యింతవిపరీతమా? దీనిని సహించి, యింకా విశేషంగా తలచటమా? ఎవ రిందుకు కారకులు? ఎవరి ననాలి? న్యాయంగా ఊర్మి అక్కమాట ప్రకారం వంటింటిలో వంటకాలపై పెత్తనంచేస్తూ, వంటవాని కేదో చెప్పుతూ ఉండిపుంటుం దనుకొందాం. వెంటనేసుడిగాలిలా యూ బ పగా రక్కడకు ప్రవేశించి 'ఇక రా!' అని అనేశాడు.

'ఇంకా యేం చెయ్యాలి?'

'విక్టోరియా మెమోరియల్ ఎంత బాగున్నదో చూపుతాను రా! నా కిపుడే విశ్రాంతి.' (

ఈసందర్భాలలో ఊర్మి బావగారిని యెదిరించలేకపోయింది. తనధర్మాన్ని గోలుపోయింది. ఏ శ్శైవరూ లేకపోయినా అన్నం కూరలు ఉడుకుతాయి. అయితే మనవాళ్ళంటూ దగ్గరవుండి తయారుచేయించితే పదార్థాలు బాగుంటాయి అని శర్మిలాదేవి అభిప్రాయం. ఆభోజనం మగవారిని సంతృప్తిపరుస్తుందని ఆమెతలంపు. ఆయన కీ ధ్యాస లేదు. వంటలో రుచులుకూడా పట్టించుకోకుండా మరోసుఖంపొందినట్లు సంతోషంలో తన్ను తాను మరిచిపోతుంటే ఆమె యేమి చేస్తుంది పాపం!

ఆమెహృదయంలో ఒకవిధమైన అలజడి యేర్పడింది. 'ఈలోకాన్ని ఒదిలిపెట్టుతూ, నేను తెలుసుకున్న ది దొక్కటే-ఉపచర్యలతో నే నాయన నానందపరచలేకపోయాను. ఊర్మిలో నా ప్రతిబింబం చూడాలి. అది వేరు - నేను వేరు కదూ! వ్యక్తిత్వం దానిలో వుంది' అని శోకిస్తూ, పలవరిస్తూ మంచం

శశాంకుడితో కొంతగొడవ అయాక. ఆమె లొంగిపో తుంది యథార్థంగా పాఠాల నాపటం ఆమెకు గిట్టనట్లే అనిపిస్తుంది. అలాగా ఆమెవికాసం మనోల్లాసవిజృంభణ నెదిరించేది కాదు. నాలుగైదుదినాలు గడిచాక ఆమెవిజ్ఞానం మళ్ళీ రేకెత్తి బాధపెట్టేది.

'మనోదృఢంలేనిదాన ననుకుంటున్నావా? చేయదలచిన పనిని చివరంటా చేసితీరుతా'నని శశాంకునితో చెపుతూంది.

'ఏమి టది?'

'ఏమిటా? ఇక్కడ చదువుపూర్తయాక వైద్యపరీక్షకు యూరపు వెళ్ళి డిగ్రీ సంపాదిస్తాను.'

'ఓహో!'

'ఆస్పత్రి నడిపించి – పోషిస్తా.'

'అంతేనా, యింకా యెవరినయినా మేపుతావా?– ఆ వెటకారపుమనిషి– నీరదముఖర్జీ–ని పోషించవూ?'

'నోరు మూయ్!' అంటూ– తనచేతితో వానినోరునొక్కి–పట్టి, 'నీవు యికమీద యిలాఅంటే, మనిద్దరికీ చెల్లు' అంది.

ఆమె విశ్వాసాన్నీ, పట్టుదలనీ స్థిరపరచుకొంటూనే ప్రాకులాడుతూంది. నిక్కచ్చిగా యథార్థమం దాసక్తిగల వ్యక్తిగా ఆత్మవంచనలేకుండాఉండాలి అని అనుకుంటుంది.

తనతండ్రి నీరదునకూ తనకూ విడువరాని బాంధవ్యాన్ని సమకూర్చి వెళ్ళాడు. దానిని భంగంచేసితే తండ్రిగారిపట్ల ద్రోహంచేసిన ట్లవుతుంది. కృతఘ్నురాలనని ఋజువవుతా నను

కునేది. కాని, నిజానికి నీరదబాబు యివ్వవలసిన హృదయ వికాసం, ప్రేరేపణ అనేవి లేకపోవట మామెకు బాధగా వుంది.

భూమాతమనస్సులో లోతుగా వ్రేళ్ళుపారిన పెద్ద మర్రిచెట్టువంటి దామె. కాని, ఆచెట్టుకు సూర్యునికిరణాలు తగల టంలేదు. ఎండప్రసారంపొందని అంతపెద్దచెట్టుయొక్క ఆకు లలోని పచ్చరంగు మారిపోతూంది. చిగురాకులు కుస్సితు న్నాయి. ప్రస్తుతము ఆమెకున్న అవస్థకూడ యిదే.

తనస్థితి యేమా అని ఆమె యోచిస్తుండేది. తనజీవితం రోతఅనిపించేది. 'అందరుమగవాళ్ళూ వాళ్ళవాళ్ళకు జాబులు వ్రాసినట్లు యితను నాకుకార్డురాయ డెందుకని? మతిలేదా?' అనుకునేది.

కాన్వెంటుస్కూలులోనే చిన్ననాటనుండీ ఊర్మి చదువు సాగింది. ఇతరసబ్జెక్టులకంటె ఆమె యింగ్లీషులో మంచిచురుకు దనం చూపించేది. ఆసంగతి నీరదబాబుకు తెలుసు. కాబట్టే ఊర్మి మెచ్చుకునేలాగా అతను యింగ్లీషులో ఆమెనుంచు డాబులుకొట్టేస్తుంటాడు. నీరదుడు యింగ్లీషులో బాగాకృషి చేయలేదు. అతని ఆంగ్లోపన్యాసాలన్నీ తప్పులమయమని అతడు గ్రహించుకోలేదు. అసలీ యింగ్లీ కంటె బెంగాలీలో అతనికి మంచిపాండిత్య ముంది.

మితిమీరినబరువుతో కిరకిరలాడే రెండెద్దులబండిలాగా నీరదబాబుగారియింగ్లీషువాక్యాలు పొడుగుసాగుతుంటాయి. అరువుపదాలు కూర్పుకలవకుండా వుంటూవుంటుంది.

అతనుమాట్లాడే యింగ్లీషు వినేటప్పుడు ఊర్మిమాల లోలోపల నవ్వుకుంటుంది. అయితే బైటకు పొక్కేది కాదు. 'బెంగాలీయువకుడుగదా! పరభాషయిన యింగ్లీషులో లోపాలను యెంచగూడదు' అని అనుకునేది.

సరదాగా వున్న సమయంలో డాక్టర్ నీరదబాబు సహజ స్వభావంననుసరించి ఊర్మికి మహోపన్యాసాలు వినిపించేవాడు. వానిస్వరూపం, క్రమశిక్షణ మున్నగునవి వానిమాటలకు విలువ నిచ్చేవి. వానివాక్యాలధ్వనికన్న వానిసుందరమూర్తే ఊర్మి మాల మనోప్రపంచాన్ని చెరుపుతుంది. పెద్దఉత్తరాలలో కూడా యీప్రభావం కన్పడదు.

అయితే, అతను తనముందున్నపుడు యెటువంటివాక్యా లకూ, అభిప్రాయాలకూ అభ్యాసపడిందో యీనాడా నీరద బాబు దూరంగావున్నా ఊర్మి వాటికే గురయింది. అతనిలో ఛలోక్తులే లేవు. హాస్యం అతనికి శత్రువు. ఈలోపాన్ని ఆయన గారు వ్రాసేలేఖలు తీర్చివేయటంచేత అతనిని శశాంకునితో పోల్చుతూంటుంది.

సందర్భానుసారంగా ఒకనాడీ విషయమే చెప్పింది. ఏవస్తువుకోసమో ఆమె తనట్రంకును వెతుకుతుండగా అసం పూర్తిగా కుట్టినస్లిప్పర్లు దొరికాయి. అప్పుడామెకు గత నాలు గేండ్లనాడు జరిగినచరిత్రను జ్ఞప్తికితెచ్చాయి అవి.

హేమంతుడు జీవించియున్ననాటిమాట. ఊర్మిమాల తనమేనత్తదగ్గర అల్లిక, కుట్టు నేర్చుకుంటుంది. ఒకరోజు వారంతా డార్జిలింగుకు పోయారు. అక్కడ వాళ్లు మితంలేని

హాస్యాలాడుకుంటున్నారు. మితిమీరినఉల్లాసంతో యెన్నో సరససల్లాపాలు పెరిగిపోతున్నాయి. శశాంక – హేమంతుల హాస్యప్రసంగాలకు హద్దులేకపోయింది. చతురులు నదిగా ప్రవహించినవి. సగంకుట్టినస్లిప్పర్లు ఊర్మిమాలచేతిలోఉండటం చూచాడు శశాంకుడు. మహేశునిజన్మదినోత్సవంపండుగ కివ్వాలని ఆమె వాటిని తయారుచేస్తూంది. శశాంకు డందుకు చాలా హేళనచేశాడు—'ఊర్మి! మీఅన్నయ్యగారికి పుట్టినరోజుబహుమానంగా యీచెప్పు లిస్తావా? హేమంతుడంతగొప్పవారి గౌరవానికి యీచెప్పులుకాకపోతే మరేమీ దొరక లేదా యివ్వటానికి–?– భగవాన్, మనువు' అని శశాంకుడు నవ్వులు పట్టించాడు.

'పోనీ, యిపుడు ఈచెప్పు లెవ్వరి కివ్వమని ఆభగవాన్ మనువు ఆదేశిస్తున్నా'డని కొంటెప్రశ్న చేసింది ఊర్మిమాల.

'గొప్పవారి అభిప్రాయానుసారంగా, వాటిమర్యాదను పొందే అధికారం బావగారిదే' అన్నాడు హేమంతుడు.

'అంతేనా? వడ్డీతోగూడా చెల్లించాలి నీవు—'అన్నాడు ఊర్మితో శశాంకుడు.

'నీకు మేము ఋణమున్నటులు గుర్తులే' దన్నది ఊర్మిమాల, 'నీ కేం బాకీలే'దంటూ.

'నీ కెందుకు గుర్తుంటుంది? మీఅక్కాయిపెళ్ళినాటికి నీవు చిన్నదానివి. ఆడుకునేవయసైనా కాదు. నీలేతచేతులతో నాచెవుల్ని మెలివేయించుకొనేభాగ్యం నాకు కలుగలేదు. నీ స్లిప్పర్లకోసం నిరీక్షిస్తున్నా డీ దీనుడు' అన్నా డాయన.

ఋణం ఋణంగానే వుంది. ఊర్మి కుట్టినజత ఆమె అన్నగారికాళ్ల నాశ్రయించటమే దానికికారణం.

ఆతరువాత ఊర్మికి శశాంకునివద్దనుండి ఒక లేఖ వచ్చింది. ఆమె కెంతో మహోల్లాసాన్ని కలిగించిం దా జాబు. ఆఉత్తరం ఈనాటికీ పెట్టెలో భద్రంగా గుప్తపరచబడి వుంది. దానినే యిప్పు డామె తిరిగి చదువమొదలెత్తింది.

'నిన్న నీవు వెళ్ళిపోయావు. నాస్మృతిపథంలోంచి నిన్ను చూచేభాగ్యం బాయకముందే నిన్నుగురించి యొక అపనింద వచ్చింది. ఆవిషయం నీకు చెప్పకుండా దాచటం నా నేర మనుకుంటాను.

ఎన్నో నేత్రాలు నా స్లిప్పర్లను గమనించి చూస్తు న్నాయి. అవి యెలాగున్నాయి అంటే నల్లమబ్బుల ఛేదించు కుంటూ నిక్కిచూచే చంద్రరేఖలలాగున స్లిప్పర్ల సందులలో నుండి చూస్తున్నాయి నావ్రేళ్లు. 'ఆనందమంగళ'ను భారతచం ద్రుడు రచించాడు. దానిని చదువు. నాపోలిక సరిగావున్నదో – లేదో అని. నీ కనుమానముంటే మీఅక్కాయిని ఋజువు అడిగి తెలుసుకో.

ఈనాటిప్రొద్దుట మాఆఫీసులో ఒకడు స్లిప్పర్లను తొడిగిన నాకాళ్ళను తుడిచాడు. ఉన్న మెరుగు మాయమైపో యిందన్నసంగతి దాగలేదు. చాలవింత! పరోకదారుణం– 'నా స్లిప్పర్లు యెటుపోయాయి' అని మహేశుని ప్రశ్నించాను.

వాడు తలగోక్కుంటూ 'మీరున్నూ, చిన్నమ్మగా రున్నూ డార్జిలింగు వెళ్ళేటప్పుడు జత తమకాళ్ళనంటేయున్న

దండీ! మళ్ళీ మీరు బయటికివచ్చేటప్పుడు ఒకకాలి చెప్పుమాత్రమే వుందికాని, రెండోకాలికి...' అని యింకా చెప్పబోతూవుండే ఆయన గ్రుడ్లెఱ్ఱచేసి గట్టిగా హుంకరించాడు. రూంలో యెంతమందో వున్నారు. 'అపహోయ్, యింకా! చెప్పులజతను అపహరించటం నీచాతినీచం. నరుడిబుద్ధి లోభ మయం. ఏంచేస్తాం? దేవుడు ఆనేరాన్ని క్షమించాలి. అందు లో జతయినా కాదు – ఒకచెప్పు దొంగిలించటమా?

దొంగను దాచిపెట్టింది. ఆమెకున్న గర్వాన్ని ఉత్తేజపర చినటులయితే తప్పకుండా యీనేరాన్ని బట్టబయలుచేసేది. ఆమెమనసే నిర్దుష్టమైయున్నటులయితే ఒకచెప్పుకోసం వైరం పెట్టుకొని యెంతచిన్నవస్తువును దొంగలించినా దొంగతనమే నన్న వాదనకు న్యాయంగా దిగేది.

నిందను వెల్లడిపెట్టే మహేశుడినోరు కట్టుబడాలంటే నీచేతులతో స్లిప్పర్లుతయారుచేసి నాకు పంపించు. వాడు వది అల్లరిముండాకొడుకు. నాకాలి ఆదెనుగూడ యిందుతో పంపి స్తున్నాను' అని వివరించివుంది ఆ జాబులో.

ఊర్మిళకా జాబు సంతోషాన్ని చేకూర్చింది. స్లిప్పర్లు తయారుచేయటానికి పూనుకుంది. అయితే పూర్తికాలేదు. కుట్టుపనిపనిమీద ఆమె కభిలాష లేకపోవటమే దానికి కారణం. ఆ డార్జిలింగుకథజరిగి యిప్పటి కేడాదిఅయింది. ఈరోజు సంవ త్సరోత్సవచిహ్నంగా బావగారికి బహూకరించా లనుకుంది. హాస్యంతో వెలిగే ఆకాశంక్రింద విహరించే పక్షులలాగున గడ

పినవోజులు కావు - క్లిష్టమైనజీవితం ఆమెముందు సాక్షాత్క-
రించింది. దరిలేని ఆయోచనని చూచి ఒకసారి 'ఉస్సు' రన్నది.

ఆరోజు ఫాల్గుణ కృష్ణ ద్వాదశీఆదివారం-హోలీపండుగ.
కార్యనిమగ్నుడయ్యాడు శశాంకుడు. హోలీపండుగలో ఆయ
నకు తీరికలేదు. పండుగన్నమాటే గుర్తులేదనాలి. శర్మిలాదేవి
పవళించినచోటికి పోయి, అక్కగారినొసట కుంకుమబొట్టు దిద్ది
నమస్కరించింది ఊర్మిమాల.

తరువాత శశాంకుని వెతికింది. ఆయనగారు డ్రాయరు
ముందుకూర్చొని లెక్కలుచూచుకుంటున్నాడు. వెనుకగా
పోయిన ఊర్మి అతనితలనిండా రంగు చల్లింది. ఆ యెర్రనిరం
గాయనఫైలుమీదకూడ పడింది. అప్పుడు నిజమైనసంగ్రామమే
ప్రారంభమయింది. చేతిక్రిందనున్న ఎర్రసిరాబుడ్డిని తీసుకొని
మరదలుచీరెమీద పోశాడాయన. ఆమెహస్తాలుపట్టి కొంగున
నున్నరంగు విప్పి మొఖానికంతా పులిమివేశాడు. ఊర్మి బావ
గారిపట్టును తప్పించుకొని పరుగెత్తింది. అతడు వెంబడించాడు.
భోజనాలవేళదాటినా శశాంకుడింకా స్నానంచేయలేదు. ఊర్మి
నవ్వులతో ఆయిల్లంతా ఘల్లుమంది. భర్తగారి కనారోగ్యం
చేస్తుందన్నభయంతో శర్మిలాదేవి త్వరగా భోజనానికి రమ్మని
వెంటవెంటనే చేసే కబురులద్వారా ఆనవ్వు కొంచెం తగ్గింది.

ఆరోజురాత్రి ప్రొద్దుపోయింది. కృష్ణచూరాచెట్లు పూలు
విప్పారినవి. వాటికి దూరంగా చంద్రుడు విహరిస్తున్నాడు.
తెరలుతెరలుగా వీచేగాలితో ముచ్చటలాడుతున్నాయి లతా

గుల్మాలు ఆనందంగా వూగుతూ. ఆచెట్లనీడలు నృత్యమాడు తూంటే అవి లయలుకలుపుతూ తలఊపుతున్నాయి.

తరుగని ఆ వసంతశోభను చూస్తూ ఊర్మిమాల కిటికీవద్ద నిశ్శబ్దంగా కూర్చుంది. ఆమెకు నిద్రపట్టనేలేదు. మధ్యాహ్నం అనుభవించిన ఆనంద మింకా మరపుకురాకపోవటమే కారణం పూతవేసిన మామిడిచెట్లు మంచిమంచిసువాసనల చిమ్ము తున్నాయి. దేహాన్ని మరిచిపోయింది. మాధవీలత పుష్ప సమితిని లోకాని కందచేయటానికి ప్రసవవేదనలు పడుతూంది. మాధవి కా బాధతప్పి దేహమంతా పూలతో నిండిపోయిం దొక తృటికాలంలో. ఆవేదనబయలుదేరింది ఊర్మిమాల హృద యంలో. స్నానాలుచేసేదొడ్డిలోకి పోయింది. తలమీద చన్నీ ళ్ళు పోసుకుంది. మనోవేదనతో వేడెక్కినశరీరం తడిబట్టతో తుడుచుకుంది. పరుపుమీదవాలి ఆలోచనలో మునిగిపోయింది. నిద్రాదేవి ఆమెను లాలనతో స్వప్నలోకాని కెత్తుకపోయింది.

వేకువఝామున రమారమి మూడుగంటల కప్రయ త్నంగా మేల్కొంచింది. చంద్రదర్శన మాకిటికీలోనుండి కను పించలేదు. చీకటిగానే వుంది గది. తెలవారీ తెలవారని వెలు గులో పోకచెట్లు నిలుచున్నాయి. ఊర్మిదుఃఖం ఆగలేదు. వచ్చే శోకాన్ని భరించలేక పరుపుమీద బోర్లపడి తలను దిండ్లలో దూర్చుకుంది. అదే మనోరోదన. ఆ చెప్పరానిబాధ యితర ధ్వనులతో అందాలతో చెప్పనలవికాదు. చేయవలసిన పనులను, హాయిని చెడగొట్టుతూ ప్రవేశించిన యీ దుఃఖవారిధి ఆమె హృదయాన్ని ముంచివేస్తుంది. ఎచ్చోట ఈ విచారనది వుద యించిందో ఆమెకుమాత్రం తెలుసా?

ఆమె కన్నులు తెరుస్తున్నపుడే సూర్యకిరణా లామెగది లోకి చొచ్చాయి. ఉదయ వేళ తాను చేసేపనుల నియమితకాల మప్పటికే దాటింది. బడలికచేత యింకా నిద్దుర లేవలే దనుకుంది శర్మిలాదేవి.

ఊర్మి నిలా తికమకచేస్తున్న విచార హేతు వేమిటి? త్యాగినిగా యెందుకు తయారుచేయాలి? నీవు తగ్గిపోయావులే అని సోళనచేస్తే విచారానికి పుట్టిల్లు యెక్కడ?

ఊర్మి సోదరిని సమీపించింది: 'అక్కా! నేను నీ కుప కారం చేయలేకపోయాను. ఇక్కడుండి నేను చేసే మహా త్కార్యం లేదు. నీవు సరేనంటే యింటికి పోతాను' అని ఊర్మి మాల అంటే శర్మిలాదేవి 'ఇపుడు పోకపోతే యేం?' అని అనలేకపోయింది.

'సరే, పోయి నీచదువు సరిగా చూచుకో. విశ్రాంతి చిక్కినపుడు వచ్చి చూచిపోతావుగా?' అంది.

పనివుండి శశాంకు డపుడు బయటకు పోయివున్నాడు. ఆసమయంచూచుకొని ఆమె వూరెళ్ళిపోయింది. శశాంకుడి కిసంగతి తెలియక ఆరోజు యింటికివస్తూ మెకానికల్ డ్రాయింగు వేసే పరికరాలను మరదలుకోసం కొని తెచ్చాడు. ఆడ్రాయింగు విధానం నేర్పుతా నని ఆమెతో యిదివరకు చెప్పియున్నందున ఊర్మికోసం యింట్లో నాలుగుమూలలూ వెతికిచూచాడు. 'ఎటు పోయింది?' అని ప్రశ్నించాడు.

'ఇక్కడ దానిచదువు సాగటంలేదట! యింటికిపోయిం' దని శర్మిలాదేవి సమాధానమిచ్చింది.

'ఆవసతులను కొద్దిరోజులలో తయారుచేయిస్తావుంటే యింతలో వెళ్ళాలా, అకస్మాత్తుగా?' అన్నాడు శశాంకుడు.

అతనికంతాన్నిబట్టి తన నాయన సందేహించాడను కుంది శర్మిలాదేవి. అధిక ప్రసంగంచేయనెంచక క్లుప్తంగా 'మళ్ళీ, దాన్ని తీసుకురండి. నేనుకూడా రమ్మన్నా నని దానికి చెప్పండి' అని అంటూ మళ్ళీ 'రా దేమో?' అన్నది తిరిగి శర్మిలాదేవి.

'చాలారోజు లైనది. నీరదుడు జాబువ్రాసివుంటా'డని ఊర్మి ప్రయాణంచేస్తూ అనుకుంది. నిజంగానే యింటికివచ్చే సరికి అతనిలేఖ యీమెకై యెదురుచూస్తోంది. తాను మహాప రాధంచేసినట్లుగా ఆఉత్తరం చదవటానికి జంకింది. ఇంతవరకూ అక్కగారిఅనారోగ్యకారణంగా తనదీక్ష మారిపోయిందని చెప్పుకునేనెపం యిప్పుడు చెల్లలేదు. దాని కొక కారణముంది. తనభార్య కుపచర్యచేయటానికి నర్సులను నియోగించాడు శశాంకుడు. వైద్యసలహాల ననుసరించి చుట్టాల నెవ్వరినీ శర్మి లాదేవిదగ్గరకు పోనివ్వటంలేదు. ఈసమయంలో ఆధారంలేని యీ సమాధానాన్ని నీరదుడు గాలికి యెగురకొట్టేస్తాడు.

నిజంగా అది కారణమేనా? అక్కాయి కామె సేవచే స్తోందా? అబద్ధం. అయినపుడు అది బలమైనవాదన కాజా లదు. అందుకై యెంతో విచారించింది. తనదే పొరపాటు అని ఒప్పుందమయింది. క్షమాపణకోరుతూ నీరదునికి ఉత్తరంవ్రా యా లనుకుంది. ముం దింక యెప్పుడూ శిక్షణమీరి పెడదా రుల సంచరించననిగూడా వ్రాయా లనుకుంది.

నీరదునిజాబు చేతనుంచుకొని నీరదునిఫోటోముందు టేబిలుమీద పెట్టింది. ఆరూపం చూచి మెన్నాళ్ళో అయింది. ఆఫోటోను తాను ప్రేమించటం శశాంకుడేగనక చూస్తే, తప్ప కుండా పరిహసించేసంగతి ఆమెకు తెలిసేవుంది. అంతమాత్రాన యీహేళన కామె భయపడదు. వాళ్ళలా మెగతాళిచేయ టమే తననేరానికి తగినశిక్ష అని నిర్ధారణచేసుకుంది.

భవానీపురంలో వుండగా నీరదునితో తనకు పెళ్ళిజరుగు తుందన్నమాట ప్రస్తావనలోకే రాలేదు. వివాహసమస్యలో ఆమె మునితత్వాన్ని పూనింది. నిజాని కా వివాహవిషయమై మాటలాడినవారూ లేరు; ఆకుటుంబంలో నీరదునితో సంబం ధాని కంగీకరించేవారూ లేరు. ఉన్నదున్నట్లుగా చెప్పటా నికి ఊర్మిమాల నిశ్చయించుకుంది. తాను చేసే ప్రతికార్యంలో దానిని వెల్లడించా లనుకుంది. పెళ్ళివిషయంలో 'తథాస్తు' అనుకొన్ననాడు తనకు నీరదబాబుయిచ్చిన వుంగర మింత దనుకా ఆపెట్టెలోనే దాచబడివుంది. ఇప్పుడే దానిని వెలుపలికి తీసి ప్రేలికి ధరించింది. ఖరీదుకట్టితే అది చాలా తేలికరకం. డాక్టరు నీరదబాబు తన కభిమానమైన లేమిడిని చాటుకుంటానికే ఆ ఉంగరాన్ని ఆమె కిచ్చాడు.

'రత్నాలవుంగరంవిలువకంటె యిది విలువైనది. దీని నాధారంగా నావిలువను చూడవద్దు. నానుండి దీనివిలువ హెచ్చాలి' అన్నాడానాడు డాక్టరు.

తానలా సమాధానంచెప్పుకొని నీరదునిలేఖను విప్పింది చదవటానికి. జాబు నలా చూస్తుండగానే చిందులుత్రొక్క నారంభించిం దామె. ఆమెకు ధ్యాన్నుచేయటం చేతకానందున

గంతులతో సరిపోయింది. నాట్యంచేయలేకపోయినందున సితారా చేతపుచ్చుకొని శృతివిషయ మాలోచించకుండానే వెత్తివాయిద్యం వాయించసాగింది. పొంగివచ్చే నూతనానం దంలో సితారానే కిందుమీదుచేస్తూంది.

అంతలోనే శశాంకు డామెగదిలోనికి వచ్చాడు.

ఆమె 'శశాంకదాదా! నిశ్చయ మయింది' అన్నది.

'త్రిప్పటాని కవకాశంలేకుండా నిర్ణయమయిందా?' అని శశాంకు డడిగాడు.

'త్రిప్పే వీలులేదు' అన్న దామె.

'సరే – మరి; మేళగాళ్ళను రమ్మని కబురుచేస్తాను. భీమనాగుడి రెస్టారెంటుకు ఆర్డరిస్తాను మిఠాయిపంపించు'మని అన్నాడు శశాంకుడు.

'వాటిఅవసరం లేదు' అన్నది.

'ఓహో! నీపెళ్ళి కన్ని యేర్పాటులు నీవే చేసుకుంటావా? అయితే, పెళ్ళిచదివింపులమాటో–?' అని శశాంకు డన్నాడు.

'ఆమరియాదలు నానుంచే పోయాయి' అని ఊర్మిమాల చెప్పింది.

'దానిచమురుతోనే చేపను తిరగమోత వేశా వన్న మాట! బలే! నా కేం బోధపడటం లేదే?' అన్నా డాయన.

'ఐతే, యీఉత్తరం చదువు' అన్న దామె చేతిలోని జాబు శశాంకునిమీదకు గిరాటువేస్తూ. అత నాలేఖసాంతంగా చదివి వెకిలిగా నవ్వసాగాడు.

'హిందూదేశంలోఉన్నపుడు పరిశోధనచేయటం జరుగ దనుకున్నాను. పరీక్షావిధాన మెంతయినా కష్టతరమైనది. నా

జీవిత మూ పరిశోధనలో లీనంచేశానుగదా! కాబట్టి గొప్ప త్యాగం నేను చెయ్యాలి. నిన్ను పెళ్లాడతానని ఒప్పందమయ్యాను. దాని నిప్పుడు తప్పించుకోనక నాకు శరణ్యంలేదు. ఆంగ్లే యూంగన ఒకామె నన్ను వివాహమాడటానికి ఒప్పుకుంది. ఆమె జీవితం నా వృత్తికంకితంచేస్తా నన్నది. కాని, ఒకపని చేబట్టాను. అది భారతదేశంలోజరిగినా, మరెక్కడజరిగినాసరే! అందువల్ల ఆపనిచేయటానికై రాజారాంబాబుగారు తనవీలునామాలో కొంతధనాన్ని నాపేర కేటాయించారు. అది నీవు నా కివ్వటం ఆయనగారికి న్యాయంచేసినట్లు. ఆయనగారికీర్తి పెరుగుతుంది. వారిఆత్మ ప్రశాంతిచెందుతుంది' అని నీరమునిజాబులో వ్రాసి ఉంది.

'ఏమయినాకానీ యీమూర్ఖుడిని దగ్గరకురానివ్వకుండా డబ్బుపారవేయటమే మేలు. వాడికి రూపాయలుచేరకపోతే ఆక లయ్యేవేగులతో ఆవురుమంటూ వచ్చిపడతాడు' అని అర్థం చేసి చెప్పాడు శశాంకుడు.

'అంతశ్రద్ధవుంటే నీవే డబ్బుపంపించు. కానీకూడా నేను పంపించ' నని నవ్వింది ఊర్మి.

'పట్టుదల విడిచిపెట్టు. గర్వపోతులకు కక్ష సొంతందాకా వుండాలి?' అన్నాడు శశాంకుడు.

'పోనీ, నాబుద్ధి మార్చుకుంటూ ననే అనుకుందాం. నీ కేం వస్తుంది?' అని యెదురుప్రశ్న వేసింది ఊర్మి.

'ఆమాటకు సమాధానంచెబితే నీగర్వం మితిమీరి పోతుంది. కాబట్టి నీ వుపకారార్థం నేను మాటాడదలచుకో

లేదు. అయినా పీడిమకురుతనంచూస్తే నేను విస్తుపోతున్నాను. వదరుబోతు' అన్నాడు తిరిగి శశాంకుడు.

గుండెలమీదిబరువును పదిమందిపట్టి దించిన ట్లనిపించిందామెకు. చిరకాలంనుండీ బాధిస్తున్న ఆభారంనుండి అనుకోకుండా తాను లొంగి యాచించకుండా దొరికిన యీ సర్వస్వాతంత్రధనాన్ని యెలా వినియోగించాలో ఆమె కర్థంకాలేదు. చనువునుగురించి నీరదబాబు శాసించిన శిక్షణాపత్రాన్ని ముక్కలుగా చించి గాలిలో యెగురచల్లింది. 'తల్లీముష్టి-తండ్రీముష్టి' అని ప్రార్థించే ఒకబిచ్చగాడిని పిలిచి వ్రేలియుంగరం విసిరేసింది. అదే నీరదుడు ప్రథానసమయంలో తన అభిమాన దారిద్ర్యచిహ్నంగా యిచ్చిన ఉంగరం.

'చిత్తుకాగితాలుకొనేవా డెవడైనా పెనిసిలుగీతలు నిండి బొండాంలాగున్న యీబొక్కును కొంటాడా?' అని ప్రశ్నించింది.

'ఎవరూ కొనకపోతే వాటి నేంచేస్తావో ముందుచెప్పు' అని శశాంకుడు తిరుగుప్రశ్న చేశాడు.

'చనిపోయినరోజుల్లో పూడ్చివేసిననాటిరాత్రిళ్ళు వచ్చే దయ్యం ఆ కాగితాలకట్టలో దాగింది. నడిరేయి నా మంచం ప్రక్కన నిలుచుండి, నావంక వ్రేలుచూపి భయపెడుతుంది' అని అన్నది.

'నీ కా భయ ముంటే - నేనే ఆకాగితాల నిప్పుడు కొనివేస్తాను. పాతపుస్తకాలబేరగా డెందుకు?' అని అన్నాడు శశాంకుడు.

'వాటితో నీ కేంపని?' అని అడిగిం దామె.

'హిందూధర్మశాస్త్రానుసారంగా వాటికి అంత్యక్రియలు చేయిస్తాను. వాటిని దహనంచేసిన బూడిద నీళ్ళలో కలిపేస్తాను. గయదాకా పోయివస్తాను. గయాశ్రాద్ధక్రియలు పూర్తిచేయిస్తాను. ఆకారణంగా నీహృదయానికి శాంతియేర్పడితే నాకు చాలు' అని శశాంకు డన్నాడు.

'ఆ! అందాకా పోనిస్తే, మితిమీరి- అమితమౌతుంది' అన్న దామె.

'ఆపని నీ కిష్టంలే దనుకుంటా. అటువంటప్పుడు యీ గ్రంథాలకట్టను భద్రంగాతీసుకొనిపోయి, నాగ్రంథాలయంలో స్థాపించి, పైన సొంపుగా పిరమిడ్ కట్టిస్తా. సరేనా?'అన్నాడు.

'ఒకమాట చెప్తా నాలకించు. ఇవ్వాళ యేపరిస్థితులు వచ్చినా మీరు వెలుపలికిపోవటానికి వల్లకాదు' అని ఖండితంగా చెప్పింది ఊర్మిమాల.

'వీలుకాదా? అన్నాడు శశాంకుడు.

'వీసమంతయినా వీలుకా'దంది ఆమె.

'అయితే, చేయదగిన బదులుకార్యమేమిటో సెలవు దయచేస్తావా?' అని శశాంకు డడిగాడు.

'కారులో యెక్కుదాం - కానరాకుండా పోదాం' అన్నది.

'మీ అక్కగారి ఆజ్ఞాపత్రం?' అన్నాడు.

'తలవాచేచివాట్లు వచ్చినాసరే, మళ్ళీ వచ్చినాకనే చెప్పటం! మ కేం భయం లేదులే' అని అన్నది ఊర్మిమాల.

'వెరీగుడ్! మీ ఆకాంక్ష తీర్చటానికి నేనూ అంగీకరించాను. నలభై అయిదు మైళ్ళస్పీడులో ఎగురుతున్న కపోతాను నిన్ను. టైరొకటి పగిలిపోయినా భయపడను. మనకా రిద్దరి మీదకు దూకినా భయపడను. శిక్షపడినా భయపడను. అయితే, ఒకటే ఆంక్ష వీటన్నిటిమీద పెట్టుతున్నాను. ఏమిటంటే ఇపుడు చేయబోయే యంత్రరథయాత్ర పూర్తయ్యాక మా యింటికి నీవు వస్తానని మాటివ్వాలి. మూడుసార్లు వాగ్దానంచేస్తే...' అన్నాడు.

'అంగీకరించాం- అంగీకరించాం- అంగీకరించాం' అని ముమ్మారు లన్నది ఊర్మిమాల.

'కారుమీద స్వైరవిహారంచేయటం పూర్తయింది. తరువాత భవానీపురానికి చేరి వాళ్ళిద్దరూ యింట్లో పడ్డారు. అయితే గంటవకటింటికి నలభై ఐదుమైళ్లస్పీడులో పరుగెత్తిన ప్రయాణభారంతో వారినాళాలింకా స్థాయి చెందలేదు. వేడి తగ్గనేలేదు. వారిదేహాలోని మహోద్రేకం వాళ్ళను గ్రుడ్డివాళ్ళను చేసింది. ఆ క్షణంలో వారిహృదయాలకు పరువు, మర్యాద, లజ్జ, అభిమానాలు తగలకపోయాయి. దూరంగా తొలగిపోయాయి.

శశాంకునివ్యాపారసంస్థలో యిటీవల కొన్నాళ్ళనుండీ అరాజకమయినపనులు బయలుదేరాయి. తనప్రవర్తన అసభ్యంగావుందని శశాంకుడికి తెలుసు. ఇటువంటికపానికి విలువ మరింతగా సమర్పించుకోవలసివస్తుందని వానికి తెలుసు. మామూలుగా రాత్రిళ్ళు నిద్రపోతుంటే భవిష్యత్తు వాని

స్వప్నంలో భయపెడుతూంది. తనకు కాలపురుషుడు హెచ్చరిక చెబుతున్నప్పటికీ అతడు మరునాటిప్రొద్దున్నే నడిచేకాలు నిలవదన్నట్లుగా ప్రవర్తిస్తున్నాడు, మేఘదూతచరిత్రలోని యక్షుడిమాదిరి.

మనోవిచారాన్ని దిగమ్రింగటానికి సారాయి నొకసారి మ్రింగుతారు ఆ అలవాటుచేత మళ్ళీ, మళ్ళీ సారాయిని మ్రింగాల్సివస్తుంది—

## శ శాం కు డు

అలాగా కాలం దొర్లిపోతూవుంది. ఉన్మాదంలో కళ్ళు మూసుకపోయాయి. మనసులో జబ్బు అంకురించింది. ఊర్మి తనదశ ముందెలా మారుతుందో ఊహించలేకుండా వుంది. అయితే ఒకనాడామెకు సత్యం గుర్తుచేయబడింది.

మధురదాదాను చూస్తే ఊర్మికెంతో నిష్కారణమైన భయం. ఆమె అతనికంటబడేది కాదు. ఒకనాటిఉదయమందే మధురదాదా శర్మిలాదేవిగదికి వచ్చి, యేదేదో మాట్లాడి వెళ్ళే సరికి మధ్యాహ్నమయింది. మధురదాదా యింటికిపోయాక ఊర్మిమాలను రమ్మని అక్క కబురుచేసింది.

ఊర్మి వచ్చి నిలబడింది. శర్మిలాదేవి దుఃఖంతోనిండిన కంఠంతో 'ఊర్మీ! నీమూలాన ఆయనను పనియందు శ్రద్ధలేనివానిని చేసి, యెంతప్రమాదంతెచ్చావో తెలుసుకున్నావా?' అంది.

'ఏమి జరిగిం దక్కా?' అని భయపడుతూ అడిగింది ఊర్మిళమాల.

'మీ బావగారు బొత్తుగా ఆయనపనుల్ని చూచుకోనటం లేదట! ఆయనబాధ్యతనంతా జనవారులాలుమీద విడిచిపెట్టా రట! చిక్కినమటుకు అన్నివస్తువుల్ని వాడు దోసిళ్ళతో దోచు కుంటున్నాడట. గోదాములమీదనున్న కప్పు పాడయి, నిరా ఘాటంగా కురిసేవర్షానికి సామగ్రి తడిసిముద్దయిపోతున్నాయట. మనకంపెనీ కిదివరకున్న పేరునుబట్టి అధికారులు కప్పు నింకా చూడకపోయినా యీనాడు మనకు అగౌరవం, ఆదాయభంగం కూడా వచ్చాయి. అందుకనిమధురదాదా తనవాటాను మనలో నుండి రద్దుచేసుకుంటానికని వచ్చిపోయాడు' అని శర్మిలాదేవి అన్నది.

ఊర్మిళమాలమనసు విచారసాగరంలో మునిగిపోయింది· ముఖం తెల్లబడింది. క్షణకాలంలో ఆమెమనోసీమయందు దాగివున్న పరమరహస్యం తేటతెల్లగా ఆమెకు తెలియచెప్పింది అక్క. తన కలా తెలియనీయని మత్తుప్రభావ మెలాంటిదో అర్థంచేసుకుంది. శశాంకునివ్యాపారం తన కిన్నినాళ్ళు శత్రు రూపంలో గోచరించింది. ఆశత్రువునే జయించా లనుకుంది. ఆవిరోధి పాడవైనచేతులలోనుండి శశాంకుని దూరంతీసికొని పోనటాని కామె యెంతోకృషిచేసింది. పూర్తిగా అతడు తన వాడు కానటమే ఆమెకోరిక సఫలమయింది. ఆయన స్నానం చేసేటప్పు డాయనగారికోసం వచ్చినవారితో 'ఆయన కివ్వాళ యెవరితోనూ మాటాడేవీలులే' దని చెప్పి పంపేది.

శశాంకుడు స్నానానంతరం పనిగొడవలోపడతాడేమో నన్నసందేహమే దానికి కారణం. లేకపోతే బావగారిని విడిచి యేకాంతవాసం చెయ్యాల్సివస్తుంది.

ఆమె స్వయంకృతాపరాధం ఆకారందాల్చి, కళ్లముందు కదంత్రొక్కుతూంది. తటాలున ఆమె శర్మిలాదేవికాళ్ల వైపు ప్రాలింది.

'అక్కా! మీయింటిలోనుండి నన్ను నెట్టివెయ్యి- నీ కెదురుగా నుండకుండా నెట్టివెయ్యి- వెంటనే నెట్టివెయ్యి' అని బోరుబోరున యేడుస్తూంది.

అంతకుముందు ఊర్మిని వన్నించరాదని నిశ్చయించుకుంది. శర్మిలాదేవి. కాని, చెల్లెలిదుఃఖం చూడగానే ఆమె మనసు కరిగిపోయింది.

చెల్లాయితలను ఆప్యాయంగా ముద్దుపెట్టుకొని 'పిచ్చిదానా! ఏడువబోకు, గడ్డుసమస్యల కేదో నివారణోపాయం విచారిద్దాంలే' అన్నది.

ఊర్మిమాల చివాలున లేచి 'అక్కా! ఈదండుగనంతా నీ వెందుకు కట్టుకోవాలి? అంతో, యింతో నాకూ ఆస్థివుందిగా' అని చెల్లాయి చెప్పింది.

'నీకు మతిపోయిం దనుకుంటాను. నేను సొంతం దివాలాతీయుపే డింకా. ఇందునుగురించి గందరగోళం జరుగని వ్వద్దని చెప్పాను, మధురబాబుతో. ఎలాగో వొకలాగు వచ్చిన నష్టాన్ని సవరించుతాను. ఇటు మనసుపెట్టి విను- ఈసంగతి నాకు తెలిసినట్లుమాత్రం మీ బావగారికి చెప్పబోకు' అని శర్మిలాదేవి చెప్పింది.

ఊర్మిమాల మళ్ళీ శర్మిలాదేవికాళ్ళమీదపడి ఏడుస్తూ 'నన్ను మన్నించు - నన్ను మన్నించు అక్కా!' అని తల బాదుకోసాగింది.

'అమ్మాయీ! ఒకరినొకరు క్షమించాలటే? జీవిత మంతా కలమాదిరి. మనఆశలన్నీ చిత్రం. ప్రేమ మనలను వం చించుతూంది' అని మాటలాడలేక ప్రయాసపడే గొంతుతో అంటూవుంది శర్మిలాదేవి.

ఈఘట్టం జరిగిపోయింది. నాటినుండి శర్మిలాదేవిని ఊర్మిమాల యెప్పుడూ విడిచివుండలేదు. ప్రొద్దస్తమానమూ అక్కను సేవిస్తూవుంది. ఆమెను పరిశుభ్రంగా స్నానాదులు చేయించేది. గుడ్డలు మార్పించేది. ఔషధం యిచ్చేది. పథ్యా పానాలు చూచేది. నిద్రపోయేదాకా కాపుపట్టేది. ఈపనులన్నీ పూర్తిచేసినపిమ్మట అక్కగారిసమీపంలో కూర్చుండి ఊర్మి మాల యేకధ్యానంతో పురాణపఠనం గావిస్తూంటుంది. ఆమె యిప్పుడు శశాంకుని అనుమానిస్తుంది. తన్నుతానే నసలే నమ్మ లేనిస్థితికి వచ్చింది.

ఊర్మిమాలలో యేర్పడిన యీమార్పుమూలంగా శశాంకు డిప్పుడు శర్మిలాదేవిగదికి రావటం జరుగుతూవచ్చింది. అత నావిధంగారావటం అంటే, విరహబాధచేత పిచ్చెత్తిన మూర్ఖుడై తేనే యిలాచేస్తాడని శర్మిలాదేవి తలంచుతుందని సందేహించేవాడు.

ఆయనగా రీగదిలో కెన్నిసార్లువస్తాడో అన్నిసార్లుకూడా ఊర్మిమాల చచ్చేసిగ్గుపడేది. పోటీఆటలలో తరచు పాల్గొంటూ వచ్చింది. చూచిరావటానికి రమ్మని ఊర్మిని శశాంకుడు పిల్చే

వాడు. మమకారంకూర్చే యిటువంటివిలాసా లింకా ఆమె నాకర్షించలేకపోయ్యాయి. ఎన్నిపాట్లుపడియైనా భార్యకెదురుగా వుండే సురదలిని తనదగ్గరకు చేర్చుకోవాలని శశాంకుని యత్నం. దినపత్రిక రోజూ తీసుకొనివస్తాడు. అందులో చార్లీచాప్లిన్‌లు యాక్టుచేసిన సినిమావార్తలను చూపించి, 'థియేటరుకు పోదాం' అని పిలిచేవాడు. అయితే, ఈఉపాయం కూడా ఆమెవద్ద పనిచేయలేదు. ఊర్మిమాలవర్తన యిలా మారి పోయినా శశాంకుడు పనిలోకిపోవాలంటే తటపటాయిస్తూనే వున్నాడు. ఈరోజాయన కిదేదోస్వాధీనంకాని పనిలాగా తోచింది.

తనబాధ్యతను తెలుసుకోలేని గ్రుడ్డివాడయ్యాడు. ఆమందభాగ్యునిఅవస్థ చూస్తుంటే నిజానికి శర్మిలాదేవి మనోవేదన చెందుతూంది. అయినా మనసులో మరియొకరకంగా సంతోషించేదికూడా. అయినా, వానివ్యథ వానిని నలిచివేస్తోంది. రోజులవారీగా ఆతనిశరీరం కృశించిపోతున్నదనీ, కంటికిచుట్టూ నల్లనిరంగుపట్టిందనీ శర్మిలాదేవి గ్రహించింది. భోజనకాలంలో ఆయనగారిముందు ఊర్మిమాలవుంటేనే ముద్దమింగుడుపడు తుందని నిర్ధారణచేసుకుంది. ఆయన పొట్టనిండా అన్నంతినటం లేదు. ఆహారంతీసుకొనటం రోజురోజుకీ తగ్గుతూవచ్చింది.

హోళీపండుగరోజూ, దానికిముందూకూడా యిల్లంతా కళలతో నిండియుండేది ఆనందం, ఉల్లాసం అనేవి ప్రవాహంగా వారిగృహాన్ని ముంచివేస్తూండేవి. ఇప్పుడటువంటి వరదలు రావటంలేదు. దానితోనే అనగా 'క్రొత్తనీరు వచ్చి పాతనీరును కొట్టుకుపోయింది' అన్నట్లుగా వారిసంసారం మైదా

నంతో పోల్చాల్సివచ్చింది. నాటిసహజశాంతిసౌఖ్యాలు ఈనాడు లేకపోయాయి.

ఇంతకుపూర్వం మజుందార్ గారు కట్టుబొట్టులను గురించి నిరాదరణ చూపేవారు. వెంట్రుకలను చాలపొట్టిగ యుండేలా కత్తెర వేయించేవారు. క్రాఫును అందంగా వేయించు కొమ్మని శర్మిలాదేవి సతపోరుతూండేది. అయితే, ఆమెప్రార్థ నలలో యేదీ జరుగలేదు. చెప్పిచెప్పి శర్మిలాదేవి చివరికి చెప్పటమే మానుకుంది. కాని, ఇటీవల ఊర్మిమాల ఆ గిరజా జుట్టునుచూచి పూర్తిపరిహాసంచేయకపోయినా, తమాషాగా ఒకముక్క విడిచింది. దానిఫలితం ఆయనను మార్పుచేసితీరింది. శశాంకబాబు క్రాఫును సరిగాచేయించటమే కాదు; ఆక్రాఫును తనజన్మలో తొలిసారి అగరునూనెతో తడిపివేశాడు. కేశవర్ధినీ మొదలైన తైలాలను ఆడ్రసుమీద వి.పి. కర్చులతో తెప్పించి, అపరిమితంగా రుద్దేవాడు.

కాని, మళ్లీ యిపుడు మొదటిలో వున్నపద్ధతులనే అవ లంబించసాగాడు. యజమానిగారి అభిమానంలేనిజుట్టు పిచ్చి వాడితలలాగున తయారయింది. దానినిబట్టి వానివిరహవేదన యెంత గాఢమయిందో గ్రహించవచ్చును. ఆయన నిపుడు గేలిచేయరాదనిన్నీ, అలాచేసినా ఫలంలేదనిన్నీ అర్థమవు తుంది. ఎందుకంటే - ప్రేమలోని సాధుత్వం వాతావరణం మారితే కర్కశత్వం పొందుతుందని స్పష్టమయింది. పెనిమిటి దుర్గతినిగురించి శర్మిలాదేవిమనసు జాలితో కష్టపడసాగింది. ఆమె తన నీచతకై యెంతగానో నొచ్చుకుంది. జబ్బు మళ్లీ పెద్దదయింది.

పోర్టులో నివసించుచున్న సేనాపటాలాలు మరుభూములలో విన్యాసాలుచేయబోతున్నాయి. జంకుతూజంకుతూనే 'ఊర్మీ! నీవూ వస్తావా? మంచిసీట్లు కొన్నాను' అని శశాంకుడడిగాడు.

ఊర్మిని మాటాడనివ్వకుండా శర్మిలాదేవే 'విధిగా వస్తుంది. ఇల్లుదాటి బైట కనుగుబెట్టి యెన్నాళ్ళో అయింది. పాపం! తీసుకొని వెళ్ళండి' అంది.

శర్మిలాదేవిసలహాలు శశాంకుడి కనుకూలంగావున్నాయి. ఇంకారెండురోజులయాక 'సర్కసుకు వెళ్ళుదామా?' అని ఊర్మి నడిగాడు. స్వతంత్రగాలికై ఆమెకూడా ఆరాటపడుతూంది. అందుకని శశాంకునికోరికను ఊర్మి అనుసరించింది.

మరిరెండురోజులు పోయాయి. 'బొటానికల్ గార్డెన్సుకు వెళ్దామా' అని శశాంకు డడిగాడు. బొటానికల్ గార్డెన్సుకు వెళ్లితే మళ్ళీ యింటికిరావటం యెంతసేపుపట్టుతుందో? అంత వరకూ అక్కగారిని ఒంటరిగావిడిచిపోవటమనేది ఊర్మిమాలకెంతమాత్రమూ యిష్టంలేదు. కొంచె మామె వెనుకాముందాడింది. అయితే శర్మిలాదేవి యీపర్యాయం ఆయనగారి ఆరోగ్యాన్ని మనసులోపెట్టుకొని 'వెళ్ళి రండి' అన్నది.

'ఆయనగారు సాయంత్రందాకా తాపీపనివాళ్ళవెంట యిసుక, సున్నం, బురదల్లో కింకుమీదవుతుంటారు. ఆమనిషి కాబట్టి కాని, మరొకరయినట్లయితే పిచ్చెత్తిపోయివుండేవారీపాటికి. షికారుకుపోయి కాస్త చల్లగాలిననుభవించకపోతేఅనారోగ్యాలపాలవుతా రాయనగారు. వెళ్ళిరా తల్లీ?' అని శర్మిలా

దేవి చెప్పింది. ఇదివంకగా ఉపయోగించుకొని రాజ్ గంజ్ దాకా షైరుకొట్టారు వారిద్దరూ.

శర్మిలాదేవిఅనుమతిపొంది వారిద్ద రలా వెళ్ళారు. తరు వాత ఆమెమనసులో యిలాఅనుకున్నది: 'ఊర్మికోసం ఆయనగా రే త్యాగమయినా చేస్తారు. ఆ పరిస్థితుల్లో ఆమె నతడు జార విడుచుకుంటాడా? ఆమెను దూరంచేసుకొని ఉండగలుగు తాడా?' అని.

'శశాంకమిత్రమా! నీప్రవర్తన బాగులే' దని మరొ కరు నోటితో చెప్పకపోయినా, తనచేతల నెవరూ వారించక పోవటంతో తనను ప్రపంచం హర్షించిం దనే అనుకొన్నాడు శశాంకుడు. తన నడవడికలో తనభార్య కే బాధా లేదను కొన్నాడు. ఇంకా తనభార్య సంతోషిస్తుందనికూడా అను కొన్నాడు. ఊర్మితో తా నీచిలిపిపనులుచేస్తూంటే వాళ్ళిద్దరినీ చూచి ఆనందించటం అనేది సామాన్యమయిన విషయం కాదు. శర్మిలాదేవి అటువంటిఅతీతాభిప్రాయాలవ్యక్తి అనేతలచాడు.

శర్మిలాదేవి అంటే ఆయనకు గౌరవంజనించి. ఆమెను దేవతాస్వరూపిణిగా తలంచాడు, శశాంకుడు. తాను ప్రభు త్వోద్యోగం చేస్తూండగా ఒకప్పుడు వారింటి కో మిత్రుడు వచ్చాడు. అతను మంచిఆర్టిస్టు. శర్మిలాదేవిరూపం ఆయన హృదయంలో పడి, మంచి తెల్లనికాగితంమీద ఆమెరూపాన్ని చిత్రించియిచ్చా డా చిత్రలేఖకుడు. ఇన్నాళ్ళకాగితాన్ని సంచిలోదాచినశశాంకుడు బయటకుతీసి యూరపియన్ కంపె నీలో చక్కనిఫ్రేముతో బిగింపుచేయించాడు. తన డ్రాయరు

కెమునువైపునోక కా బొమ్మను తగిలించాడు క్రింద నొకపీట వేయించాడు. పూలతోట్టి నొకదాని నాబల్లమీద పెట్టి, ఆమొక్కను రోజూ పాలించమని తోటమాలి కనుజ్ఞలిచ్చేశాడు.

చివరిరోజులు వచ్చాయి. ఊర్మిళను తనవెంట నిడుకొని శశాంకుడు ప్రొద్దుతిరుగుడుపుష్పాలను చూపటానికై తోటలోనికిపోయాడు. తలవనితలంపుగా ఊర్మిచేతిని శశాంకుడు పట్టుకొని 'నేను ప్రేమిస్తున్నాను నిన్ను. అది నీవుగమనించావా? మీఅక్కవిషయం వేరు - ఆమె జ్ఞానస్వరూపిణి — దేవతామూర్తి. ఆమెను నేను పూజించినట్లు నాజీవితంలో యెవరినీ పూజించలేదు. ఆమె మన కతీతమయింది. సాక్షాత్ సురత్వం పొందిన దివ్యాంగన. మనకంటె కొన్ని రెట్లధికురా'లన్నాడు.

'ఊర్మీ! నీవు నన్నునుగ్రహిస్తే నాఆత్మకు శాంతివుంది. ఈజీవితంలో నేనుకోరేకోరిక యింకొకటి లేదు. నాస్థానంలో నీవుకాకుండా వేరొక స్త్రీ ప్రవేశించటమంటే చాలవిచారకరం. కాని, యిప్పుడు మీబావగారు వారిసౌఖ్యాలను సవరించియిచ్చే కొంతసహాయంలేని అనాదరజీవితాన్ని గడపటం నేను చూడలేను. వారికొంకతరకపోతే ఆయనగారిగుండెలు దెబ్బతింటాయి. అప్పుడెంతైనా ప్రమాదం కలుగుతుంది. ఆయనహృదయంలో తపింపచుతూన్న ఆవాంఛ ఒక్కసారి తీరితే, మళ్లీ తనవ్యాపారంలో సరిగా తిరుగుతారు. మనం మామూలుస్థితికి వస్తాం' అని శర్మిలాదేవి ఊర్మికి బోధిస్తూవచ్చింది.

బావగారిప్పుడిలా ప్రారంభించారు :-

శశాంకునిమనస్సు సంతోషంతో సాగిపోతూంది. ప్రకృతికిసంబంధించిన బాధ్యత, శ్రమలు, ఆయనగారుచూచే ఊహ

లోకంలో కనుపించటంలేదు. క్రైస్తవులవలె ఆటవిడుపుకు ఆది వారాన్ని నియమించుకున్నాడు. ఆవార మాయనకు పవిత్రదిన మయిందికూడ

ఆరోజు శనివారం. శర్మిలాదేవిని సమీపించి 'రేపు సెలవురోజు. జూట్‌మిల్లుదొరలతో మాటాడి లాంచీ కావా లని తీసుకున్నాను. ఊర్మికి డైమండ్‌హార్బరు చూపించా లను కున్నాను. చీకటివిడకుండానేపోయి, సాయంత్రంఅయేసరికి తిరిగి వస్తాం' అని చెప్పాడు.

శర్మిలాదేవి జీవనాడులన్నీ పట్టిపిండినంతబాధ పడింది. ఆమెఫాలభాగము ముడతలుపడిపోయింది బాధతో. ఆవ్యాకు లాన్ని శశాంకు డేమాత్రమూ గురుతించలేకపోయాడు.

'మరి భోజన మెలా?' అన్నది శర్మిలాదేవి చాల మృదు స్వరంతోనే.

'ఆ యేర్పాటులన్నీ హోటలులో సిద్ధంచేయించాను' అని శశాంకుడు సమాధానంచెప్పాడు.

ఇటువంటిసంగతులను, నిర్ణయాలనుపూర్వం శర్మిలాదేవే పూరించుతూండేది. ఆరోజులలో శశాంకుడు వీటి జోక్యం కలిగించుకొనేవాడు కాడు. తాను మంచంయెక్కినందున యీనాడు యేకొద్దిపనైనా ఆయనే నవరించుకోవలసివచ్చింది. వాతావరణమంతా కిందుమీదయిం దనుకుంది శర్మిలాదేవి.

'సరే! పోయి రండి' అన్నది.

శర్మిలాదేవినోటినుండి ఆ మాట రావటంతోడనే చివా లున శశాంకుడు లేచాడు. తొందరగా వెళ్ళాడు. శర్మిలాదేవికి పెద్దగాయేడ్వాలనేబుద్ధి పుట్టింది. తల దిండులో దూర్చి 'ఈ

ఆరాట మెందుకు? నాకు మరణం రాలేదేం?' అని విచార
పడింది.

ఆమరుసటిరోజే ఆదివారం. వాళ్ళవివాహమయిం దా
నాడే! జరిగిపోయిన అన్నిసంవత్సరాలూ యీ పండుగ తప్పక
చేస్తూవచ్చారు. పద్ధతిమారకుండా ఈసంవత్సరంకూడా చెయ్యా
లనుకుంది. శశాంకునికిచెప్పకుండానే కావలసినసన్నాహమంతా
సిద్ధంచేసింది, ఆ తీరనివ్యాధితో బాధపడుతూకూడా శర్మిలాదేవి.
కాని, ఆట్టే పెద్దతతంగంమాత్రం లేదు. వివాహంనాటి
బెనారసుపట్టుపంచె ధరించుమని చెప్పాలనుకుంది. పట్టుచీరెను
తాను కట్టుకుం దా మనుకొంది. వారిమెడను పూలమాలతో
అలంకరించి, తనసముఖంలో భోజనంచెయ్యమని కోరుదా మను
కుంది. ఆగదికి సాంబ్రాణిధూపంపట్టి, ప్రక్కగదిలో సన్నాయి
మేళంప్లేటుతో గ్రామఫోను పెట్టా లనుకొంది. ప్రతిపండుగకు
శశాంకు డేదో క్రొత్తవస్తువును తెచ్చి బహూకరించి ఆమెను
సంతోషపెట్టేవాడు. ఈసారికూడా తనకిచ్చే బహుమానమేదో
తెచ్చివుంచుతా డనుకుంది శర్మిలాదేవి.

అయితే, యీనాటికథలన్నీ అడ్డంతిరిగాయి. ఆమెకు
యేకాంతగృహవాసం సంభవించింది కల్ల! ప్రపంచమంతా
కల్ల! ప్రయోజనమనేదేలే దని యేమేమో అనుకుంటూవుంది.

ఆతెల్లవార్లూ ఆమెకు కునుకుపట్టలేదు. బాగా తెల్ల
వారకముందే కారువెళ్ళినట్లు తెలుసుకుంది, దానిహారనుమ్రోత
విని. ఆమెవిచారం భరింపరానిదై పోయింది.

'దేవా! నీ లోకమాయ. భ్రాంతికూడ మాయ' అని
విలపించటం మొదలుపెట్టింది శర్మిలాదేవి.

ఆరోజునుండి ఆమెకు జబ్బు మరింతపెరుగ నారంభిం చింది. ఒకనాడు ప్రమాదస్థితి వచ్చింది. భర్తకు కబురు పోయింది. అది సంధ్యవేళ. గదిలో వెలుగు సరిగాలేదు. బైటకు పొమ్మని నరుసుకు సైగచేసింది శర్మిలాదేవి. భర్తను తనసరసన కూర్చుండుమని సైగతో చెప్పింది. పెనిమిటిచేతులను స్వహస్తాలతోపట్టుకొని 'భగవానుని వరప్రసాదంగా తమరిని చూచుకొన్నాను. కాని, మిమ్మానందింపజేసేనేర్పు నాకా దేవుడివ్వలేదు. మనస్ఫూర్తిగా మీ కేలోపం చేయలేదు. తెలియని పొరపాటులు జగిగితే మన్నించండి' అని వేడుకుంది.

ఏదోచెప్పటానికి శశాంకుడు ప్రయత్నించాడు. శర్మిలాదేవి అడ్డువచ్చి 'నన్ను చెప్పనివ్వండి. ఊర్మిని తమహస్తాలలో పెట్టుతున్నాను. ఆమె నా తోబుట్టువు. నారూప మామెలో కనుపిస్తుంది. ఇంకా మీ రేదికోరుతారో, నాలో యేది లేదో, అది ఆమెలో మీకు లభిస్తుంది. స్థిమితంగా కూర్చోండి. అడ్డుచెప్పకండి. ఈలోకాన్ని విడిచేముందు మీకా ఆనందాన్ని కూరుస్తున్నాను. అది నా అదృష్టమే' అన్న దామె.

నరుసు బైటనిలుచుని 'డాక్టరుగారు దయచేశారు' అని బిగ్గరగాచెప్పింది.

'తీసుకురా, లోపలి' కన్నది శర్మిలాదేవి.

ఆలూమగలసంభాషణ అప్పటికి ముగిసింది.

*                    *                    *

శర్మిలాదేవిమేనమామగారికి బైరాగులచిట్కావైద్యం మీద అలవిమాలిన నమ్మక ముంది. ఈమధ్య ఆయన కో గోసాయితో స్నేహంకలిగింది. డాక్టరులంతా అసాధ్యపు

రోగంగా శర్మిలాదేవిజబ్బును నిర్ణయించారు. హిమాలయాల ప్రాంతాలలోతిరిగివచ్చిన ఆసన్యాసిమందుకూడా వాడిచూద్దామని ఆయనగారు సలహాయిచ్చాడు. ఆచెట్టుమూలికలచూర్ణం తిని, పాలుత్రాగాలి. ఆయుర్వేదమంటే శశాంకుడికి చెప్పరాని ఆవేశం. అక్కరలే దన్నాడు. కాని, శర్మిలాదేవి 'పోనివ్వండి నయంకాకపోతే కాకపోయింది. మా మయ్యమాట నిలిపినవార మవుతాం' అన్నది.

లెక్కచేయని ఆమందు పనిచేసింది. శ్వాసకోశంలో బాధ నివారణమయింది. ఉమ్మిలో క్తం కనపడటంలేదు. పదునైదురోజులయ్యేసరికీ లేచి కూర్చుండే ఆరోగ్యం పొందింది శర్మిలాదేవి. ఒకొక్కసారి చావుసమీపించినపుడు శరీరంలో అనుకోకుండా మార్పుజరుగుతుంది. దానితో ప్రాణం గట్టున పడుతుం దని వైద్యు లన్నారు. ఎలాగో బ్రతికింది శర్మిలాదేవి.

భరించరాని దుఃఖకారణం. ఎలా చేయటం? బ్రతికి యెంతో సంక్షోభం పొందాలికదా! చచ్చిపోతే యెంత హాయిగా వుండేది? తుద కీజీవితం నరకకూపంలో పడవల్సిందేనా యేం?

ఊర్మిమాల తనగుడ్డాగోచీ మూటగట్టుతూంది. ఆమె యీ యిల్లువిడిచి పోదగినతరుణం దగ్గరికి వస్తూంది. ఇంతలో ఆమెదగ్గరికి శర్మిలాదేవి వచ్చింది.

'నీవు వెళ్ళేవీలు లేదు.'

'ఎందు కని?'

'అక్కాచెల్లెండ్రు ఒకేభర్తను పెళ్ళాడటం భారతీయ మతవిరుద్ధమా?' అని అడిగింది శర్మిలాదేవి.

'అబ్బా! సిగ్గుచేటు' అన్నది ఊర్మిమాలాదేవి.

శశాంకునిరమ్మని, శర్మిలాదేవి కబురంపింది. 'చెల్లితో మనలను లోకం నిందిస్తుం దనుకుంటే – వలసపోదాం నేపాలుకి. రాజుకొల్వులో నౌకరి దొరుకుతుందిగదా! ప్రయత్నంచేద్దాం' అని శర్మిలాదేవి ఆలోచనచెప్పింది.

అడ్డులేని తనఅధికారంతో శర్మిలాదేవి నేపాలురాజ్యానికి ప్రయాణసన్నాహాలు జరిపిస్తుంది. ఊర్మిమాల అదొకరకమైన విచారంగా యింట్లో తిరుగుతోంది. ఎక్కడైనా దాగియుండాలనే ఆమెకూడా అనుకుంటూవుండేది.

'ఈపరిస్థితిలో నన్ను విడిచిపెట్టి నీవువెళితే, నాస్థితి ఎలా మారుతుందో ప్రత్యేకంగా చెప్పేపనిలేదు–'ఊర్మితో శశాంకుడన్నాడు.

'ఒకనిర్ణయానికి వచ్చేటందు కాలోచిస్తున్నాను' అని, మళ్ళీ 'నీ నిర్ణయాన్నే నేనూ అనుసరించదలచుకొన్నా'నని చెప్పింది ఊర్మిమాల.

పనిముట్లు, ప్రయాణకృత్యాలు సవరించుకుంటానికి కొంతకాలం పట్టింది. నేపాలుప్రయాణపుగడువు దగ్గరికివచ్చింది. ఊర్మిమాల 'ఒకఅవసరమైనపనిమీద మామయ్యదగ్గరికి వెళ్ళుతున్నాను. ప్రయాణ మొకవారందాకా నిలిపివెయ్యండి' అంది.

తనపనికోసం ఊర్మిమాల వూరెళ్ళింది.

ఆతరువాత మధురబాబు విచారంగావున్న శర్మిలాదేవి దగ్గరకు వచ్చాడు.

'మంచిసమయంలో మీరు ప్రయాణంకట్టుతున్నారు. పోయినసారి నీతో ప్రసంగించినపిమ్మట వ్యాపారాన్ని గురించి శశాంకబాబూ నేనూ ఒకనిర్ణయానికి వచ్చాం. ఋణపడకుండా మాభాగాలు మేము పంచుకున్నాం. తనవాటావ్యాపారం నిలిపివేయటానికి లెక్కలుపారచూస్తున్నాడు శశాంకబాబు. లెక్కలన్నీ చూడగా ఆయనగారు నీధనంగూడా వాడేవాడు. ఇంకా మిగిలినఅప్పులవారికి కీ యిల్లమ్మి జమకట్టవలసివచ్చింది' అని చెప్పాడు.

'తా నిలా గోతిలోపడబోతున్నా నన్నమాట ఆయన గారిమనసు కెప్పుడూ తగలలేదా' అన్నది శర్మిలాదేవి.

'కొన్నికొన్నిపరిస్థితులలో నాశనమవుతున్నామనిగాని, మవుతామనిగాని గనునించలేరు. మెలుపుమాదిరిగా వచ్చేస్తుంది. రెప్పపాటుకాలమైనా ముందుగా మనకు తెలియదు. తను పెట్టే దండుగ లాయనకు తెలిసేవున్నాయి. ఆసమయంలో యెలాగో దొర్లించేవాడు. అంతేకాకుండా ఆనష్టాలను తిరిగి పూడ్చు కోవాలని ఆదుర్దాపడి తెలివితక్కువపనులుకూడా చేశాడు. ఆకారణంగా మరీ దెబ్బతిన్నాడు. నాకు తెలియకుండానే బొగ్గువ్యాపారంచేశాడు. చికాకుపడి సరుకును విక్రయించేశాడు. మార్కెటు పెరిగేది, తరిగేది ఆలోచించేపనే మానుకున్నాడు. తొందరపడి తక్కువవెలకు సరకులు యిచ్చేశాడు. చివరకు లెక్కలు చూచుకుంటే నష్టం కనుపించిందని తెలుసుకున్నాడు. కాబట్టి, ఆపరమాత్మునిదయవల్ల నేపాలులోనైనా అతనికి నౌకరీదొరకటం మంచిదే ననుకుంటున్నా' నన్నాడు మధురబాబు.

దరిద్రదేవత పేరు తలుచుకుంటే శర్మిలకు తగనిభయం ఇబ్బందులలో పెనిమిటి చిక్కుపడ్డాడు. గృహంలో తనఅవసర మిప్పుడు బాగావున్నదని ఆమెకు తెలుసు. తనస్థానం సురక్షిత మని తెలుసుకుంది. లేమికితో చికిపోయే పెనిమిటిమనస్సును లాలించాలంటే యితరులవల్ల కాదని ఆమె గ్రహించింది. తన వంటిమీదిసొమ్ములను విక్రయిస్తే యీదరిద్రం కొన్నాళ్ళ దాకా దరిచేరదని వూహించింది. దీనికితోడు ఊర్మినికూడా పెళ్ళి చేస్తే దానిఆస్తికూడా వారి కుపయోగిస్తుం దన్నమాట ఆమె మనసుకు లీలగా కనుపించింది.

అయితే, సామాన్యజీవనం అంటే ఆమెకు గిట్టదు. ఆమెభర్త తనశరీరకష్టంతో యీసంపదనంతా గడించాడు. దాని కోసమయ్యే ఆమెసంతోషాలను వదలుకొంది. అటునంటిలక్ష్మి వచ్చినట్లే వచ్చి, మెరిసినట్లే మెరిసి మాయమైపోయింది.

ఈనీచమర్యాదను పొందటానికే బ్రతికానుకాబోలు! ఈ దశకు ఆయనగారిమనసు బాధపడదా ? ఈదుర్గతికి కారణమైన వ్యక్తిని ఆయనగా రింక సైరింపగలుగుతారా? ఆమెప్రసాదించిన భోజనాన్ని విషమాన్నంగా భావించడుగదా ! ఆయనగారు ఉన్మాదఫలితంగా లజ్జపడి సారాతో సతమతమౌతాడేమో ? ఊర్మి కికముందాబాధను భరించవలసినస్థితివస్తే, అప్పుడీయన దానిజీవితమందలి ప్రతిఒక్కనిమిషాన్నీ యమయాతనలపాలు చేస్తా డనుకుంది శర్మిలాదేవి.

*　　　*　　　*

వ్యాపారంలో నీభార్యసొమ్ముకూడా చాలలేదని శశాంకునిలెక్కలాతనిని బెదిరించాయి. తాను చెల్లించవలసిన

బాకీలను దనదాకా రాకుండానే శర్మిలాదేవి సవరించినట్లుకూడా విన్నాడు. చేతిలో ప్రభుత్వోద్యోగాన్ని వదులుకుని స్త్రీధన సహాయంతో యెలా వ్యాపారాభివృద్ధి చేసుకున్నాడో అంతా స్మృతికి తెచ్చుకున్నాడు శశాంకుడు.

తిరిగి యిప్పుడు శిథిలమైన యీవ్యాపారాన్ని చూడకుండా పరుగెత్తి, నౌకరిలో దూకుతున్నానా? శర్మిలాదేవికి తీర్చవలసినఋణభారం నాపీపునుండి తొలగిపోలేదు. ఉద్యోగంతో బాకీతీర్చేధనాన్ని సంపాదిస్తానా? ఇది సాధ్యపడేపనేనా? అని శశాంకుడాలోచించాడు.

నేపాలుప్రయాణ మింకా పదిరోజు లుంది. రాత్రి అంతా ఆయన జాగరణచేశాడు. వేకువఝామునే ప్రక్కనుండి లేచి, అదిరేటట్లు డ్రెస్సింగ్ టేబిలుమీద గుద్దాడు.

'నేపాలుప్రయాణం వొద్దు' అని కేకలుపెట్టాడు. నేనూ, నీవూ యీకలకత్తాయందే ఊర్మితోగూడా వుండిపోదాం. ఈవాగుడుబోతుసమాజాలను, సంఘీయులనెదిరించి ధైర్యంగా వుందాం. ఈచోటనే యీకలకత్తాలోనే నావాణిజ్యమందిరాన్ని తిరిగి వుద్ధరించుదాం!' అని అంటున్నాడు.

శర్మిలాదేవి అదేసమయంలో ప్రయాణాని కవసరమైన వస్తులను లెక్కవ్రాస్తోంది. అప్రయత్నంగా తన్నుపిలిచిన కేక విన్నది. చేతిలో కాగితాన్ని అలాగే వదిలేసి, భర్తదగ్గరికి పరుగెత్తింది. 'ఏమిఅపకారంజరిగిందోనని ఆమె హడలిపోయింది. వణికిపోయే కంఠంతో 'ఏమి టేమిటి?' అని అడిగింది.

'నేపాలుకు నేను రాను. ఈవూళ్ళోనే వుంటాను. సంఘాన్ని ప్రతిఘటిస్తాను. సాధిస్తాను' అన్నాడు శశాంకుడు.

'ఏం - జరిగింది?'

'అవసరమైన పని.'

'అవసరమైనపని_! అప్పటిమాట మళ్ళీనా?' ఆమెమనసు భయపడసాగింది.

'నేను చేతగానిదద్దమ్మ ననుకోబోకు శర్మీ! నాధర్మం తెలుసుకోలేని మూర్ఖుడ్ని కాదు. అంతపతనం కాలేదు' అని శశాంకుడు గట్టిగా అరచాడు.

శర్మిలాదేవి మెల్లగా అతనిని సమీపించి భర్తచేతుల్ని పట్టుకుంది.

'విశదీకరించి చెప్పండి' అన్న దామె.

'నీకు నేను మళ్ళీ ఋణపడ్డానా, కాదా? యథార్థం దాచకుండా చెప్పు' అన్నాడు మజుందార్.

'నే నేం దాచను' అంది.

'మునుపటిమాదిరే నీ అప్పుమొత్తం యీరోజులగా యితూ తీరుస్తాను. మరచిపోబోకు నామాటలు. నీవు అగాధంలో విసిరివేసినవస్తువును నేను తెచ్చి నీకు వప్పగించుతాను. ఇదివరలో న న్నెలా విశ్వసించావో అలాగే యిప్పుడుకూడా విశ్వసించు' అన్నాడు.

శర్మిలాదేవి శశాంకునిగుండెలమీాది కలా వొరిగింది.

'తమవిశ్వాసాన్ని అనుభవించనివ్వండి. నన్ను మీాబోధ నలతో తయారుచేసి, మీావస్తువుగాపరిగ్రహించండి. మీాపనిలో నాకు సగభాగ మివ్వండి' అని ప్రార్థించటంమొదలుపెట్టిం దామె.

'ఉత్తరాలండీ!' అని బయటనుండి పోస్టుప్యూన్ కేక వినవచ్చింది. వచ్చినరెండుజాబులమీాదా ఊర్మిమాలదస్తూరి కనుపించింది.

ఒకటవజాబులో—

'మా బావగారికి,

యూరపుపోవాలని బొంబాయికి బయలుదేరాను. మా తండ్రిగారితో చెప్పినమాట చెల్లించవలసినధర్మం నాయం దున్నది. ఆరేడుసంవత్సరాలలో పరీక్షపొంది డాక్టరుగా వస్తాను. మీాసంసారంలో నేను రేకెత్తించిన కల్లోలంలోవచ్చిననష్టాన్ని యీాలోపల సవరించుకొనే వీలు మీాకు దొరుకుతుంది. నన్ను గురించి మీా రేమీా శ్రమపడవద్దు. మిమ్ముగురించి నేను తప్పక బాధపడాలి.

యిట్లు,

మీా—ఊర్మిమాల.'

ఇక రెండవజాబులో—

'అక్కగారికి,

నీకు వెయ్యివందనాలు. నీకు నే నపచారం తెలియక చేశాను. మన్నించు. 'చెల్లీ! నీవేమీ నేరంచేయలే'దని నీవంటే నాకు పరమసంతోషం చేకూరుతుంది. అంతకంటే సౌఖ్య ముండదు. నిజానికి సౌఖ్య మనేదేదో బోధపడలేదు. ఎక్కడ లభించేదీ తెలియదు. నాజన్మ కది లేకపోయినా మంచిదే. ఇకముం దా నేరాలు నేను చేయకుండా వున్నానంటే నా కదే పదివేలు.'

ఇట్లు
నీ చెల్లెలు
ఊర్మిమాల.'

సంపూర్ణం